

# గ్రంథాలయసర్వస్వము.

ప్రతిమాసమునను సచిత్రముగ వెలువడును


సంపు. ౮ ] బెజవాడ [ సంచిక ౬

మార్చి ౧౯౩౪



అయ్యంకి వేంకటరమణయ్య

సంపాదకుడు





వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును
ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును
సూర్యచంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి
ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో అట్లే
జ్ఞానముకూడ సౌఖ్యప్రదము కావలయును

చిలకమర్తి లక్ష్మీనరసింహము


వార్షికమూల్యము : సభ్యులకు రు ౩

ఇతరులకు రు ౪ విడిసంచిక పావలా

# బెజవాడ సరస్వతీ బుక్‌డిపోవారి స్వంత ప్రచురణములు.

## ఆంధ్రదేశమున ప్రదర్శింపబడు నాటకములు.

| | రు. | అ. |
|---|---|---|
| సతీ సక్కుబాయి సో॥ రా॥ | 0 | 12 |
| శ్రీకృష్ణతులాభారము ము॥ సు॥ | 1 | 0 |
| సత్యహరిశ్చంద్రీయము బ॥ ల॥ | 1 | 0 |
| బుద్ధిమతీ విలాసము డిటో | 1 | 0 |
| రంగూన్ రౌడీ సో॥ రా॥ | 1 | 0 |
| ధరణికోట డిటో | 1 | 4 |
| సతీ అనసూయ డిటో | 1 | 0 |
| గంగావతరణము డిటో | 1 | 0 |
| మహాభక్త విజయము డిటో | 1 | 0 |
| ద్రౌపదీ వస్త్రాపహరణము మ॥ అ॥ | 1 | 0 |
| సావిత్రి శ్రీ॥ స॥ | 1 | 0 |
| చింతామణి కా॥ నా॥ | 1 | 0 |
| మధుసేవ డిటో | 1 | 0 |
| పత్నీప్రతాప్ అను అనసూయ సో॥ అ॥ | 1 | 0 |
| రాధాకృష్ణ పా॥ ల॥ | 0 | 12 |
| పాదుకాపట్టాభిషేకము పా॥ ల॥ | 1 | 4 |
| జయంతజయపాలము ఆ॥ న॥ | 0 | 12 |
| కృష్ణలీల బళ్లారి కే॥ సు॥ | 1 | 4 |
| రామదాసు డి॥ గో॥ | 1 | 0 |
| రసపుత్రవిజయం ఇ॥ య॥ | 1 | 0 |
| రాణాప్రతాప్‌సింగు డిటో | 1 | 0 |
| చంద్రగుప్త సం॥ శి॥ | 1 | 0 |
| దుర్గాదాసు జం॥ శి॥ | 1 | 4 |
| రాణాప్రతాపసింహ డిటో | 1 | 0 |
| రాధాకృష్ణ సాంగ్సు చం॥ కే॥ | 0 | 12 |
| తులాభారంసాంగ్సు డిటో | 0 | 12 |
| చండిక నాటకం ము॥ వే॥ | 1 | 0 |

## ఆదిభట్ల నారాయణదాసుగారి హరికథలు.

| | రు. | అ. |
|---|---|---|
| జానకీ శపథము | 1 | 0 |
| రుక్మిణీకల్యాణము | 0 | 12 |
| మార్కండేయ చరిత్రము | 0 | 12 |
| హరిశ్చంద్రోపాఖ్యానము | 0 | 12 |
| అంబరీష చరిత్రము | 0 | 8 |
| ప్రహ్లాద చరిత్రము | 0 | 8 |
| గజేంద్రమోక్షము | 0 | 8 |
| భీష్మచరిత్రము | 0 | 8 |
| పైన ఉదహరించిన 8 పుస్తకములు కలిసిన క్యాలికోబైండు | 5 | 8 |

## బి. బాలాజీదాసుగారిహరికథలు.

| | | |
|---|---|---|
| గయోపాఖ్యానం | 0 | 8 |
| జయప్రదాదేవిచరిత్ర | 0 | 8 |
| నలచరిత్రము | 0 | 8 |
| రుక్మాంగద చరిత్రము | 0 | 8 |
| కుశలవ విజయము | 0 | 8 |
| శశిరేఖాపరిణయము | 0 | 8 |
| సంగ్రహ రామాయణము | 1 | 0 |
| బయాకర విజయము | 0 | 8 |
| త్రిశంకు విజయము | 0 | 8 |
| సీతాకళ్యాణము | 0 | 8 |
| ద్రౌపదీ మానసంరక్షణం | 0 | 6 |
| కుచేలోపాఖ్యానం | 0 | 6 |
| పురందరదాసు చరిత్ర | 0 | 6 |
| హరికథేతిహాసమంజరి పా 1 | 0 | 6 |
| డిటో రెండవభాగము | 0 | 6 |


మావద్ద అనేకరకములు గలవు. కోరినవారికి నూరుపేజీల కేట్లాగు ఉచితముగా పంపబడును.

వలయువారు:—కురుకూరి సుబ్బారావు, ప్రొప్రయిటరు, సరస్వతీ బుక్‌డిపో, బెజవాడ.

# 17వ ఆంధ్రదేశ గ్రంథాలయ మహాసభ, మద్రాసు.



ఆహ్వాన సంఘాధ్యక్షులు

**దేశోద్ధారక, జ్ఞానదాత, విశ్వదాత, కాశీనాథుని నాగేశ్వరరావుగారు.**



అధ్యక్షులు

దాసు త్రివిక్రమరావుగారు,

బార్-ఎట్-లా.



హరిబ్రహ్మాదీనాం దేహీ భుక్తిముక్తి ప్రదాయినీం,
గ్రంథాలయానాం తామేవ ప్రణమామి సరస్వతీమ్.

౯-వ సంవత్సరము. | ౬-వ సంచిక.

# గ్రంథాలయ సర్వస్వము

మార్చి, 1935

## గ్రంథాలయములు — నవయుగము.

( కాటూరి వల్లభుల పురుషోత్తంగారు, ఎమ్. ఏ. )

ప్రాచీన భరతఖండమున బ్రాహ్మణ విద్వాంసులే నడచు సార్వజనిక గ్రంథాలయములని విశేషముగ నెఱుగరు. కాబట్టి విల్సను దొర చెప్పినట్లు ప్రతి బ్రాహ్మణుడును నడిచెడు గ్రంథాలయముగనే యుండిన (Every Brahmin was a moving library) దేశములో స్థావర గ్రంథాలయముల కంతగా నావశ్యకత లేకపోవుట వాస్తవమే. ప్రస్తుత పరిస్థితులనుబట్టి మన విజ్ఞానాభివృద్ధి ముఖ్యముగ గ్రంథాలయస్థాపనముపైననే యాధారపడియుండును. మహాపండితులు మొదలు నిరక్షరులవఱకును గల వివిధప్రజాళికి నేడు గ్రంథాలయములు చేయగలిగిన సేవ యెంతయో కలదు.

ఒకశాస్త్రములో గట్టి పాండిత్యము గలవానికి ప్రాచీనకాలమున గ్రంథములతో ప్రసక్తి చాల తక్కువయని చెప్పవలెను. తత్త్వశాస్త్రమును తీసికొందము. అ. గా. పాండిత్యము గలవాని కెల్ల ఉపనిషత్తులు, గీతలు, వేదాంతసూత్రములు మొదలగు గ్రంథసముదాయ మంతయు కంఠస్థముగనే యుండెను. నేడు పాశ్చాత్య తత్త్వశాస్త్రములో కొంత పాండిత్యమున్నవానికి కూడ కాంటు, స్పెన్సరు, హెగెల్ మున్నగువారి గ్రంథములను క్షుణ్ణముగ సమీక్ష్యము చేయగు

చుండును. శాస్త్రములే కాదు. తుదకు నిఘంటువులు మున్నగు కాదాచిత్కావశ్యకములైన గ్రంథములు(Reference books)కూడ మనపూర్వులకు కంఠస్థములే. నేడన్ననో యెంతపండితునకైనను నిట్టిగ్రంథముల యపేక్ష కల్గుచునే యుండును.

ఒజ్జ లేనిచో విద్యలేకుండుట పూర్వమేకాని యిపుడు కాదు. విద్య యొకదరి చేరకుండగనే పాఠశాలాకళాశాలలను వీడవలసివచ్చిన జిజ్ఞాసగలయువకులకు గ్రంథాలయము వేయి గురువులపెట్టు. ఈవిధముగ జ్ఞానము నార్జించి వృద్ధిలోనికి వచ్చినవారెందఱో కలరు. కీర్తిశేషు లగు బాబూ బిపిన్‌చంద్రపాలుగారు ఎఫ్. ఏ. తరగతిలో నుండగనే కళాశాలకు స్వస్తి చెప్పవలసివచ్చెను. అనంతర మాయన యొక గ్రంథాలయములో నిరీక్షకుడుగ నుండి క్రమముగ నందలి గ్రంథములన్నిటిని చదివి విశేషవిజ్ఞాన మార్జించెను. కళాశాలలోనుండి గురువులయొద్ద విద్య నభ్యసించినవారిలో నెందరు పాలుగారంత విజ్ఞానసంపన్నులైరో మన మెఱుగుదుము.

ప్రాథమిక విద్యతో చదువు ముగించువారికి తత్సంస్కారము నశింపకుండ నుండవలెననినచో గ్రంథాలయము లత్యావసరములు. బాలురు గ్రామపాఠశాలను వీడి వ్యవసాయాదివృత్తులలో దిగి క్రమముగ నక్షరములనుగూడ మఱచిపోవుట నేడు తఱచుగ గన్పట్టుచున్న యంశము. కొంతకాలమున కట్టి బాలురు ప్రాథమిక పాఠశాల కెన్నడును పోయియుండని బాలురతో సమానముగనే నిరక్షరు లగుచున్నారు. పాఠశాలను వీడినదిమొదలు వారు చదువగల్గిన పుస్తక మేదియు వారి కెన్నడును కన్పట్టక పోవుటయే యిందులకు కారణము. గ్రామములో గ్రంథాలయముండి తన్నిర్వాహకులు నిపుణు లగుచో వారట్టి బాలురకు సుబోధము లగు గ్రంథముల నందించుచుండగలరు. అట్టి గ్రంథములవలన వారికి విశేష విజ్ఞాన మలవడక ముఖ్యముగ వినోదముకొఱకే యవి యుపయోగపడినను గూడ వానివలన విస్తారలాభము కల్గుచున్నదనియే చెప్పవలెను. ఆధునిక నాగరకతలో పఠనలేఖన సామర్థ్యము లవశ్యములుగ పరిగణింపబడు కనీస పరికరములుగ భావింపబడుటయే యిందులకు హేతువు.

నాగరకదేశములలో సుమా రందఱును నక్షరాస్యులుగనేయున్న యీ దినములలో గూడ నూటికి తొంబదిమంది నిరక్షరులుగనే యున్న మన నిర్భాగ్యదేశస్థుల వైజ్ఞానికాభివృద్ధికికూడ గ్రంథాలయోపకారులే పూనుకొను టవసరము. లోతుగ నాలోచింతుమేని జ్ఞానమునకును వ్రాతకోతలకును విశేషసంబంధము లేదు. అక్షర మెఱుగనివాడుకూడ ప్రపంచములో నేయే దేశములు గలవో యెచటిప్రజ లెట్టివారో తెలిసికొనుటకు వీలున్నవి. భరతఖండము మొదటినుండియు నెట్టి చారిత్రకపరిణామములకు లోనగుచుండెడిదోకూడ నట్టివాడు తెలిసికొనుటకు సాధనము లున్నవి. రామాయణ భారతాదులలోని సమస్త వృత్తాంతములను పూసగ్రుచ్చినట్లు చెప్పగల పామరులు నేటికిగూడ ననేకులు గలరు. అక్షరములనుచూచుటకుకూడ కన్నులు లేని యెందఱో నేడు గణితశాస్త్రములో పాండిత్యమును సంపాదించియున్నారు. ధర్మశాస్త్రములలోనున్న యనేకధర్మములను నిరక్షరులైన మనవారెందఱో మిక్కిలి చక్కగ చెప్పుట చూచుచున్నాము. వీనినన్నిటినిబట్టిచూడ పఠనశక్తి విద్యోపార్జనమునకేకైక సాధనము కాదని స్పష్టము కాగలదు. దేశాటనము వీథినాటకములు, పురాణశ్రవణము మున్నగు నెన్నియో

సాధనములవలన మన పూర్వులు జ్ఞానమార్జించుచుండిరి. దురదృష్టవశమున నేటికిని నిరక్షరులుగనేయున్న మనవారి నిట్టిమార్గములచే తరింపజేయుటకు గ్రంథాలయోద్యమాభిమానులు పూనుకొనవలసియున్నది.

పైన క్రమముగ పేర్కొనబడి యున్న తరగతులవారికినిగూడ నుపయోగపడునవి వార్తాపత్రికలు. వార్తాపత్రికలే లేనిచో నవయుగమే లేదు. ఇవి యెంత విరివిగ వ్యాపించిన నంత త్వరలో ప్రజా ప్రబోధమగును. తద్ద్వారమున నూతనయుగ ఫలావాప్తియు మనకు గలుగును. రాజకీయ మన స్వత్వమే యాధునిక ప్రపంచ లక్షణము. ఇది మనలో వృద్ధియైననే కాని మన యథార్థస్థానమును పొందలేము. అంతేవఱకును నైతికార్థికాది విషయములలో గూడ మన కభివృద్ధి కలుగనేరదు. కాన గ్రంథాలయాధికారులు పత్రికలను తెప్పించి చదువుకొనువారికి వసతి గల్పించుటయే కాక యక్షర జ్ఞానము లేనివారి నందఱ నొకచోటకూర్చుండబెట్టి వారి కందఱకును వార్తాపత్రికలను చదివి వినిపించి యవసరమైనచో వివరించి బోధపఱచుటకూడ చేయింపవలెను.

ఈ విధముగ పండితులకును, నగరములో పాఠశాలలను మానినవారికిని, ప్రాథమిక విద్యతో చదువు చాలించినవారికిని, నిరక్షరులకును గూడ నాధునిక యుగములో గ్రంథాలయములవశ్యములును నత్యంతలాభదాయకములును నగుచున్నవి. ఏతత్స్థాపన వ్యాపన సంస్కరణ ప్రయత్నము లాంధ్రదేశములోనే జరుగుచుండుట యెంతయు ముదావహము.

---

# ప్రయోజన విద్యావశ్యకత – ఇప్పటి విద్యావిధానము.

(శనివారపు **సుబ్బారావుగారు.**)

ప్రజలకు విద్య గరపుటలో 6 విధములు గలవు. అందు ఒకటి బాగుగా విద్య నేర్చిన పండితులవద్ద శిష్యులుగా చేరి కొంత కాలము వారితో ఉండడము. ఇట్టి పద్ధతి హిందూరాజుల పరిపాలన కాలమున ఎక్కువగా అమలులో నున్నటుల మన చరిత్రలవల్ల తెలియుచున్నది. రెండవది మహాత్ములు, ఋషులు ఏర్పాటుచేసిన ఆశ్రమములందు చేరి కొంతకాల మందు నివసించుట. ఇట్టి విధానములు ప్రస్తుత కాలమున అంతగా అమలులో లేవు. ఋషులని పేరుగాంచినవా రిప్పుడు లేరు. మహాత్ములని పేరుగాంచినవారు గలరు. అట్లు వారిలో మహాకవి రవీంద్రనాథ టాకూరుగారు, మహాత్మాగాంధి మహాయోగి అరవిందఘోషు, మున్నగువారు కొద్దిమందే కలరు. ఇట్టివారు కొన్ని ఆశ్రమములను నెలకొల్పిరి. ఆ ఆశ్రమములలో కొంతమంది చేరి నూతన విజ్ఞానమును సంపాదించుకొనుట కలదు. మూడవది ప్రత్యేకవిమర్శనా పాఠశాలలు. ఇవికూడ చాలా తక్కువగనే ఉండును. భారతదేశమందంతటిలో కీ. శే. గోపాలకృష్ణ గోఖలేగారు పూనానగరమున "అఖిలభారత సేవాసంఘము" అను పేరిట నొకటి స్థాపించిరి. పంజాబు కేసరి అని పేరుగాంచిన కీ. శే. లాలాలజపతిరాయిగారు "రాజకీయ విజ్ఞాన పాఠశాల" అను పేరిట నొక సంఘమును స్థాపించెను. ఈ రెండు సంఘములలోను సభ్యులుగా

గాని లేక వారి అనుమతిపై కొంతకాలమచ్చట కావలసిన విజ్ఞానమును సంపాదించుకొనుటకు గాని ఉండవచ్చును. ఈ మూడు తరగతుల విద్యాభ్యాసమువల్ల నిత్యజీవితములో నూతన మార్పునన్న ప్రజాసేవ చేయుట కుపయోగపడు విజ్ఞానమున్నూ లభింపగలవు.

నాల్గవది: ప్రభుత్వమువారు, స్థానికస్వపరిపాలకులు, ప్రత్యేకవ్యక్తులు ఏర్పాటుచేసిన ప్రాథమిక, మాధ్యమిక, కళాశాలయందలి విద్యను నేర్చుకొనుట.

అయిదవది: మాధ్యమికవిద్య కళాశాలలందలి విద్యలను అభ్యసించిపిమ్మట, మామూలు ప్రజాసామాన్యమునకు ఎక్కువగా ఉపకరించు విద్యగాక వారిని పీడించు విద్యకై, వైద్యము, న్యాయశాస్త్రము, వ్యవసాయశాస్త్రము, ఇంజనీరింగు, గనులపరిశ్రమ, కో-ఆపరేటివు, ఉపాధ్యాయవృత్తి - మున్నగు వాటిలో ఉద్యోగములను సంపాదించుకొనుట కేర్పడిన ప్రత్యేకపాఠశాలలందు చదువుకొనుట.

ఆరవది: భారతదేశములోని విద్యాలయములవారు ఇచ్చు బిరుదులుచాలక, వేనకువేలు వెచ్చించి ఎక్కువజీతములుగల ఉద్యోగములను సంపాదించుకొనుటకుగాను విదేశములకుపోయి కొన్ని బిరుదులను తగిలించుకొని వచ్చుచుండు విద్య.

పైన వివరించిన నాలుగైదు ఆరు తరగతివిద్యలను నేర్చినవారందరికి ఉద్యోగాలుదొరకక, పనిలేనివారిసంఖ్యలో చేరుచున్నారు. ఇందులకు కారణము నిత్యజీవితమున నుపకరించు వృత్తివిద్యలను నేర్పు విద్యావిధానము మనదేశమందు లేకపోవుటయే. ఇంతేగాక, వీరు వత్సరములకొలది విదేశభాషలో విద్య నభ్యసించుచుండుటవల్ల వీరు ఖర్చుపెట్టిన ఎక్కువసొమ్మంతయు పరభాషను నేర్చుకొనుటకే ఖర్చుఅగుచుండెను. మాతృభాషలో నేర్చుకొనినయెడల కొలది వత్సరములలోనే ఎట్టివిధానముతోకూడిన విజ్ఞానమునైన సులభముగా నేర్చుకొనవచ్చును.

ఇపుడు ఎవరు విద్యావంతులుగా పరిగణింపబడుచున్నారు?

స్కూలుఫైనలువరకు చదివినగాని అంతకుపైగా చదివినవారుగాని చదువుకొన్నవారుగా పరిగణింపబడుచున్నారు. బి. ఎ, ఎం. ఎ, లు చదివినవారు బి.యల్. చదివినవారు విద్యావంతులుగా పరిగణింపబడుచున్నారు. అంటే మాతృభాషలో పూజ్యముగా ఉన్న విదేశీయభాషఅయిన ఇంగ్లీషుభాషలో డిగ్రీలుంటె చాలును. అంతేనేగాని తెలుగుభాషలోగాని, సంస్కృతభాషలోగాని, హిందీభాషలోగాని ప్రవీణతను సంపాదించినవారు విద్యావంతులుగా లెక్కలోనికి రావడములేదు కాని ఇట్టివారిలో ఇంగ్లీషు భాషాపరిజ్ఞానమున్నవారు కొందరు ముందుకు చొరుచుకు రావడము గలదు. కాని అట్టివారికి తగిన సహాయసంపత్తులు లేనను ఒకవేళ సహాయసంపత్తి ఉన్నను పైకి లేవనెత్తుటలో తగినసహకారులు లేకపోవడమువల్లను అడుగంటి ఉంటున్నారు.

మానవనిత్యజీవితమునకు చదువుట, వ్రాయుట, లెక్కలు కట్టుట ముఖ్యముగ కావలయును. ఈమూడు నేర్చినవారు పాఠశాలలలోను చదువుకోకుండా గ్రంథాలయములయొక్కయు పఠనమందిరములయొక్కయు ఉపయోగమువల్లను లేక గ్రంథములను పత్రికలను స్వయముగాకొనుక్కొనియు విజ్ఞానమును సంపాదించినవారెందరో గత పన్నెండువత్స

రములనుండి బయలు దేరుచున్నారు. అట్టి వారింకను విద్యావంతులుగ పరిగణింపబడుట లేదు.

గ్రామవిద్య ప్రధానమా?

పట్టణవిద్య ప్రధానమా?

ఈకాలమున గ్రామపరిపాలన నశించినది. పరిపాలన మొత్తము నొక కేంద్రమునకు చేర్చబడినది. ఆ కేంద్రస్థానములు పట్టణములలోనే ఉండియున్నవి. ఆపట్టణములలోనే విద్యాసంస్థలుండుటచే. అందువల్ల పల్లెలలోని విద్యకు ప్రాముఖ్యము లేదు, పట్టణములలో నేర్పు ఇంగ్లీషువిద్యకు ప్రాముఖ్యము వచ్చుచున్నది. భారతదేశస్థితిగతులనుబట్టి యోచించిన భారతదేశములో 1931 సంవత్సర జనాభా లెక్కలనుబట్టి రమారమి 7 లక్షల గ్రామములును రమారమి 25 వందల పట్టణములును గలవు.

ఇంతేగాక గ్రామములలో నివసించే

| | |
|---|---|
| జనసంఖ్య | 313858567 |
| పట్టణములలో నివసించువారు | 38979211 |
| మొత్తము | 352837778 |

గలరు. ఈ రెండు అంశములనుబట్టి గ్రామాదులలో నేర్పు విద్యకే ప్రాముఖ్య ముండవలెనని స్పష్టపడుచున్నది.

ప్రస్తుతము ప్రభుత్వమువారు నేర్పు విద్య నిత్యజీవితమున కేమాత్రము ఉపయోగపడక గుమాస్తాపనికే ఉపకరించునదిగ నుంటున్నది. మనదేశమున కేరీతి విద్య గరుపవలెననునది కూడ మనదేశముయొక్క ముఖ్యవృత్తులనుబట్టి నిర్ణయింపవలసియున్నది. 1931 జనాభా లెక్కలనుబట్టి మనదేశములోని ముఖ్యవృత్తు లీదిగువ రీతిగ నుండెను.

వ్యవసాయ వృత్తిలోనున్నవారి వివరములు.

1921 జనాభా లెక్కలనుబట్టి

| భూస్వాముల సంఖ్య | స్వయంగా వ్యవసాయవృత్తి చేసే వారి సంఖ్య | వ్యవసాయవృత్తిలో కూలిపనిచేయు వారి సంఖ్య | చేరిక |
|---|---|---|---|
| 80 లక్షలుమంది | 16 కోట్ల 70 లక్షలమంది | 3 కోట్ల 80 లక్షలు మంది | 22 కోట్ల 90 లక్షలమంది |

అనగా రమారమి నూటికి 72 రు వ్యవసాయవృత్తిలోనున్నట్లు తేలుచున్నది. వ్యవసాయవృత్తికి సంబంధించిన గృహపరిశ్రమలను వ్యవసాయవృత్తికి కావలసిన పశుసంపదను వృద్ధిచేయుటకున్ను వ్యవసాయవృత్తివల్ల పండించు సరకులతో ఏయేవస్తువులను తయారు చేయుచున్నారో ఆవివరములున్ను ఇందులకు సంబంధించిన లెక్కలుమున్నగునవి నేర్పువిద్యయే గ్రామవిద్య అనబడును. ప్రస్తుతము గ్రామములలో నేర్పే విద్య వ్యవసాయవృత్తికిగాని గృహపరిశ్రమలకుగాని ఎంతమాత్రము సంబంధము లేదు. దీనినిబట్టి గ్రామవిద్య ప్రాధాన్యముగ లేదని స్పష్టపడుచున్నది.

ఎట్టివారి కేరీతి ప్రయోజనవిద్య కావలెను?

గ్రామములలోనుండు జనాభాలో 12 వత్సరములు దాటిన వయస్సుగలవారు పొలముపనిలో ప్రవేశించెదరు. పట్టణములలోకూడ అదే యీడుగలవారు ఫ్యాక్టరీపనులలో గాని లేక వర్తకవ్యాపారులవద్దగాని ప్రవేశించెదరు. 12 వత్సరములు లగాయితు 16 వత్సరముల వయస్సుగలవారి నొకతరగతిగను, 17 వత్సరముల వయస్సులగాయితు 20 వత్సరములు వయస్సుగల వారందరిని మరొకతరగతిగాను, 21 వత్సరముల

వయస్సు లగాయితు 30 వత్సరముల వారిని ఇంకొకతరగతిగను, 31 వత్సరములవయస్సు లగాయితు 40 వత్సరములవయస్సుగలవారి వరకు ఒక తరగతిగను విభజించి యీ 4 తరగతులవారికి రాత్రిపాఠశాలలును, వారికి తీరికగల ఋతువులలో అనగా పొలములలో పనిలేని కాలమున పగటిపాఠశాలలను ఏర్పాటు చేయవలెను. మూడు లేక నాలుగు మైళ్ళలో నుండే గ్రామసముదాయమంతటిలో మధ్యస్థముగా నుండెడి గ్రామమున నొక రాత్రిపాఠశాలను ఏర్పాటు చేయవలెను. ఆపాఠశాలలో చేరువారందఱు రెండుసంవత్సరములు చదివితీరవలెనను నియమముండితీరవలెను. ఈ రెండువత్సరముల కాలములో నీదిగువ అంశములు నేర్పవలెను.

గ్రామపరిపాలన లగాయితు, భారతదేశపరిపాలన వరకు వివరముగాను వివిధదేశముల పరిపాలనా విధానము క్లుప్తముగను, (2) గ్రామ, తాలూకా జిల్లా, రాష్ట్రములలో పండు పంటలు వాటివిడుదలవివరములు, ఆయాపంటల పండించు విధానమున్ను (3) పశుసంపద అభివృద్ధిఅయ్యే మార్గములున్ను వాటి చికిత్సయున్ను (4) గ్రామములోనికి, జిల్లాలోనికి, రాష్ట్రములోనికి దిగుమతి అయ్యే సరకులున్ను భారతదేశము మొత్తము మీద దిగుమతి ఎగుమతి వ్యాపారములున్ను వాటివల్ల రైతునకు కలిగే లాభనష్టములున్ను (5) గృహపరిశ్రమ లెట్టివి వ్యవసాయదార్లు అవలంబించవలెను అను విధానమున్ను (6) గ్రామ, జిల్లా, రాష్ట్ర, భారతదేశ చరిత్రలు వివరముగాను ఇతరదేశములచరిత్రలనుగూర్చి క్లుప్తముగాను (7) ఆరోగ్యశాస్త్రము (8) పారిశుద్ధ్యము (9) మహాపురుషుల జీవితచరిత్రలు (10) హిందూమతమునుగూర్చి ప్రత్యేకముగను తదితరమతములగూర్చియు బోధించుచు మతకలహములు, సాంఘికకలహములునుండరాదనియు భగవంతు డందరికి ఒక్కడే అను భావమును (11) వార్తాపత్రికలకు విశేషములు వ్రాయు విధానమును వార్తాపత్రికలవల్లగాని మంచి గ్రంథములవల్లగాని తెలిసికొనిన అంశములను క్లుప్తముగా ప్రజలకు ఉపన్యాసమూలకముగా తెలుపు విధానమును (12) గ్రంథాలయములు పఠనమందిరములవల్ల కలిగే ప్రత్యేక ఉపయోగములు వాటిని నెలకొల్పు విధానమున్ను అట్టి దానిని ప్రయోజన విద్యా పాఠశాలలో చేరిన వారిచే ఒకటి నడిపించుచు ఆదర్శప్రాయముగ నుండునటులను (14) ప్రదర్శనశాలల ఏర్పాట్లు వాటివల్ల ఫలితములు తెలుపుచు ఫిర్కా, తాలూకా, జిల్లా ప్రదర్శనశాలలను ఏర్పాటుచేయుటకు (14) పరిపాలనా శాఖలలో ఏయేశాఖల వల్ల నెట్టెట్టి పనులు జరుగుచున్నవియు అట్టివి ప్రజల కేరీతిగ తోడ్పడుచున్నవియును (15) గ్రామాభివృద్ధికి గ్రామపంచాయితీ, పరిశ్రముల నభివృద్ధికి పరపతిసంఘములు ఏర్పాటుచేసి యీ రెంటిద్వారా మత, సాంఘిక, రాజకీయ, ఆర్థిక శాస్త్రములపై ప్రయోజన విద్యను గ్రామప్రజల కేరీతిగ గరుపవలెనను నొకప్రణాళికను తయారుచేయు విధానమును నేర్పవలయును.

ఈ విద్యఅంతయు పటములు, అంకెలు, మ్యాజికులాంతరు ప్రదర్శనములు, ఉపన్యాసములమూలమునను, చిన్నచిన్న కథలరూపమునను నేర్పవలెను. చదువుట వ్రాయుట, లెక్కలుకూడా పైన వివరించిన విద్యతోపాటు నేర్పవలయును. రెండు సంవత్సరముల అనంతరము పరీక్షలు గావించి ఉత్తీర్ణులైనవారికి సర్టిఫికట్టుల నీయవలెను. ఇట్టివిద్యను నేర్పి వదలివేసినచో వా రంతటికి వారే గ్రంథాలయములు, పఠనమందిరముల సహాయముతో నీ రెండు వత్సర

ములలో నేర్చుకొనిన విద్యను అభివృద్ధి జేసుకొనగలరు. అవసరముల వెంబడిన నెల నెలకు గాని లేక ప్రతి 3 నెలలకుగాని ప్రత్యేక ఉపన్యాసముల నిచ్చుటకు ప్రవీణులను రప్పించుకొని ఆరీతిగ నూతనవిజ్ఞానమును ఎప్పటికప్పుడు తెలిసికొనగలరు.

### ప్రయోజన విద్యాప్రచారకులు తయారగు విధానము.

రాష్ట్రీయగ్రంథాలయసంఘము వారు రాష్ట్రమంతటికి నొకప్రదేశమున ప్రయోజనవిద్యాప్రచారకులను తయారుచేయుటకు ఒక ఏడాది నియమితకాలముతో నొకబోధనాపాఠశాలను ఏర్పాటుచేయవలెను. అందు ప్రచారకులను తరిబీదుచేయవలెను. అట్టివారే పైనవివరించిన ప్రదేశములందు ప్రయోజనవిద్యా పాఠశాలలలో ఉపాధ్యాయులుగ నుండవలెను.

ఇట్టి ఉద్దేశముతోనే నేను, 1931 సం॥ర మున రాజమహేంద్రవరమున నుండు రామదాసు కో-ఆపరేటివ్ ట్రెయినింగు ఇన్‌స్టిట్యూటునందు గ్రామపునర్నిర్మాణతరగతుల పేరిట ఒకఏడాది నియమితకాలముతో ఏర్పాటుచేయబడితిని. సుమారు 70 మంది విద్యార్థులు విద్యగరచిరి. అందు తరిఫీనుఅయిన వారిలో కొంతమంది గ్రామపంచాయితీలలో గుమాస్తాలుగను మరికొందరు కొన్నికొన్ని గ్రామములను కలిపి గ్రామపునర్నిర్మాణసంఘమనునది ఏర్పాటుచేసికొనియు గ్రామసేవకై పనిచేయుచున్నారు. మరికొంతమంది పత్రికలకు వ్యాసములు వ్రాయుటలోను ఉపన్యాసము లిచ్చుటలోను చిన్నచిన్న గ్రంథములను, కరపత్రములను వ్రాయుటలోను ఆరితేరిరి. 1932 నుండి మరల ఇట్టి పాఠశాలలు కారణాంతరములచే నడుపబడలేదు, ఈ అనుభవమునుబట్టి ప్రయోజనవిద్యాప్రచారకులను తయారుచేయు బోధనతరగతి పాఠశాల ప్రతిరాష్ట్రమున ఒకటి ఉండితీరవలెనను నది తేట్టినది.

### ప్రాథమికపాఠశాలోపాధ్యాయులకు వసంత హేమంతఋతు విద్యాలయములు.

ప్రాథమికపాఠశాలలలోనుండు ఉపాధ్యాయులకు ప్రపంచకజ్ఞానము అంతగా తెలియదు. వారికి నేర్పు బోధనాతరగతులలోనైన అట్టిది నేర్పరు. వీరికిని ప్రయోజనవిద్యా ప్రచారమును గూర్చియు గ్రామపునర్నిర్మాణమును గూర్చియు నేర్పుటకు వేసవికాలపు సెలవుల లోను శీతకాలపు సెలవులలోను 15 రోజుల గడువుతోగాని లేక అధికము 10 రోజులగడువుతోగాని ప్రతితాలూకాలోని ఉపాధ్యాయుల నొకచోట సమావేశపరచి నేర్పుట సమంజసముగ నుండును.

### ప్రయోజనవిద్య కెవరు సహాయపడవలెను?

మ్యునిసిపాలిటీలు, జిల్లాబోర్డులవారు వారంతటికి వారేప్రయోజనపాఠశాలలను పైనవివరించిన రీతిని ఏర్పాటుచేయవచ్చును. అట్టివారు పూనుకొనియెడల తాలూకా, జిల్లా రాష్ట్రీయ ప్రయోజనవిద్యాసంఘములు ఆయాతాలూకా, జిల్లా, రాష్ట్రీయగ్రంథాలయసంఘములద్వారా ఏర్పాటుకాబడవలెను. ఇట్టిసంఘముల వారే పైన వివరించినరీతిని ప్రయోజనపాఠశాలలను గ్రామస్థులసహాయముతో ఏర్పాటుచేసి రాష్ట్రమంతటిలో ప్రయోజనవిద్యావ్యాపకమును గావింపవలెను. ఇట్టివాటికి వీలువెంబడిని గవర్నమెంటు వారివద్దనుండియు, స్థానికసంఘములనుండియు సాలీనావిరాళములను పొందుటకు ప్రయత్నించుచుండవలెను.

### రాష్ట్రీయవయోజన విద్యాసంఘమున వారికి కర్తవ్యము.

రాష్ట్రమంతటిలో పట్టివయోజనవిద్యను గరుపవలెనను ప్రణాళికను తయారుచేసియు, అందులకు కావలసిన పటములు, అంకెలు తెలుపు పట్టికలు, గ్రంథములు, కరపత్రములు మున్నగునవి అనుభవశాలురచే వ్రాయించి ప్రచురించుచుండవలెను. తాలూకా, జిల్లావయోజనవిద్యాసంఘములకు తగుసలహాలిచ్చుచు సాలుసరిరిపోర్టులను తయారుచేయుచు ప్రచురించుచుండవలెను.

### వివిధదేశములలో జరుగు వయోజన విద్యాప్రచారము.

పాశ్చాత్యదేశములలో మతకర్తలు, వర్తకులు, విద్యావంతులు, గ్రంథకర్తలు, పత్రికాసంపాదకులు, సర్వకళాశాలలవారు వయోజనవిద్యావ్యాపకమునకు వసంతఋతు హేమంతఋతువుల పేరిట తాత్కాలిక పాఠశాలలను నెలకొల్పియు, రాత్రిపాఠశాలలను నెలకొల్పియు, సంచారపాఠశాలలను నెలకొల్పియు అనేకరీతులుగ సహాయపడుచుండుట కలదు. ప్రభుత్వమువారుకూడ ధనసహాయము చేయుచుండుట కలదు. స్వాతంత్ర్యముగల దేశములలో ఏపనిఅయినను చేయవీలగును. మనదేశములోని విద్యార్థులు, సర్వకళాశాలలోని ఉపాధ్యాయులు, ఎవరైన ఉత్సాహవంతులు నెలకొల్పు వయోజనవిద్యాశాలలకుగాని లేక వయోజనవిద్యాప్రచారకులబోధనాసంగతులకుగాని లేక వసంతహేమంతఋతు విద్యాలయములకుగాని వచ్చి సహాయపడవలెను.

ధనికులు, వర్తకులు విరివిగ విరాళములు విదేశములలోవలెనే మనదేశములోకూడ నిచ్చుటకు అలవాటుపడవలెను. సర్వకళాశాలలోని ఉపాధ్యాయులు, కాలేజీలలోని ఉపాధ్యాయులు, హైస్కూళ్లలోని ఉపాధ్యాయులు తమకుండే సెలవుదినములలో వయోజనవిద్యాసంఘములవారికి అన్నివిధముల సహాయపడుచుండవలెను. రైతులిచ్చుపన్నులనుండే తాము వందలకొలది జీతములు తీసుకుంటున్నామని తెలిసికొని ఆఋణమును తీర్చుకొనుటకే వారు వయోజనవిద్యావ్యాపకమునకు సహాయపడ కోరెద. వయోజనవిద్యాప్రచారము అభివృద్ధిజెందినగాని మనభారతదేశము అన్నివిధాల ఔన్నత్యస్థితిలోనికి రాజాలదని గ్రహింతురు గాక!

---

## శ్రీ వీరేశలింగకవి సమాజము – కుముదవల్లి.

( 37 వ వార్షికమహాసభా వృత్తాంతము. )

ఈ సమాజముయొక్క వార్షికసభ 6-1-35 తేదీన ఈశ్వరప్రార్థనతో ప్రారంభింపబడి విశాఖపట్నంవాస్తవ్యులును దేశాభిమానులునగు శ్రీయుత మల్లెమడుగుల జగన్నాథరావుగారి యాజమాన్యమున జయప్రదముగా జరుపబడినది. ఈసభకీ చుట్టుపట్ల గ్రామాదులవారు కూడ వచ్చిరి.

అధ్యక్షుల ప్రారంభోపన్యాసమైన పిమ్మట కార్యదర్శినివేదిక చదువబడినది.

తరువాత డాక్టరు పాలకోడేటి సత్యనారాయణ శర్మగారు గ్రంథాలయోద్యమము వాని యుపయోగములనుగురించి ముచ్చటించిరి. పిమ్మట గూడిపాటి సత్యనారాయణగారును ముదుండి లక్ష్మీనరసింహరాజుగారును గ్రామపునర్నిర్మాణమునుగురించియు అడివి బాపిరాజుగారు ఆధునిక ఆంధ్రవాఙ్మయమునుగురించియు, తల్లాప్రగడ ప్రకాశరాయుడుగారు సంఘసంస్కరణమునుగురించియు ముచ్చటించిరి.

పిమ్మట రేపల్లెతాలూకా గ్రంథాలయాధ్యక్షులు గ్రంథాలయోద్యమాభివృద్ధికి కొన్ని సూచనలు కనపరచుచు గ్రామాభివృద్ధికి సర్వవిధముల గ్రంథాలయములే శరణ్యములని నొక్కి చెప్పిరి.

తరువాత హిందీభాషావశ్యకతనుగురించి వద్దిపర్తి రాజారావుగారును స్త్రీపునర్వివాహమును గురించి భాగవతుల నరసింహశాస్త్రిలుగారును ఉపన్యసించిరి.

అధ్యక్షుని ఉపసంహారోపన్యాసము.

ఈ గ్రంథాలయము 22-6-1897 తేదీని స్థాపించబడినది. ఆనాడు వీరేశలింగము పంతులుగారిపేరు ప్రఖ్యాతిగా నుండుటచేతను, ఆయన సాంఘికసేవను సాధ్యమయినంతవరకు అనుకరించి ప్రోత్సహించుటకు, ఆయనభాషాసేవను స్మరించుటకు గ్రంథాలయము ముఖ్యావసరమునెంచి యీ గ్రామపెద్దలు కొందరు అప్పటి గ్రామకరణముగారితమ్ముడైన పండ్రంగి చిన్నమరాజుగారి ప్రోత్సాహమున శ్రీ వీరేశలింగ కవి సమాజ మనుపేరుతో బయలుదేరతీసినారు. గృహనిర్మాణమునకు దగడముతోనే నూరు రూపాయలిచ్చినారని పోలవరం జమీన్‌దారుగారిపేరు (కే. ఆర్. వి. కృష్ణారావు) ఈమందిరమునకు పెట్టినారు. గ్రామాభివృద్ధికి వలయు సాధనములన్ని అవలంబించి సాంఘికసేవ భాషాసేవ, దేశసేవ, చేయుటయే ఈసమాజగ్రంథాలయోద్దేశము. ఆ ఆదర్శమునకు మే మెంత దూరమున నున్నామో తెలియజేయుటకు ఈ 37వ వార్షికవృత్తాంతమును మీముందుట పెట్టుచున్నాను. ఈసాలున గ్రంథాలయమునకు సాలుకు ఒక రూపాయిచందా నిచ్చువారు 44గురు సభ్యులు కలరు. ఈసంవత్సరము జరిగిన అయిదు మహాసభలలో శ్రీ వీరేశలింగకవివర్ధంతి, కోటికపూడి సీతమ్మగారి నిర్యాణసానుక్రోశసభ, రాజా రామమోహనరాయలవారి వర్ధంతిసభ, శ్రీ కృష్ణజయంత్యుత్సవము, మహాత్మాగాంధి జన్మదినోత్సవము, సక్రమముగా జరుపబడినవి. కార్యనిర్వాహకవర్గమువారు 11 సారులు కూడి 32 తీర్మానములు చేసి అమలునం దుంచినారు. గ్రంథాలయము తెరచియున్న కాలములో చదివినవి 67 పుస్తకములుమాత్రమే కాని పురుషులు 205 పుస్తకములును స్త్రీలు 254 పుస్తకములును ఇండ్లకు చదువుటకు తీసికొనివెళ్లినారు. వార్తాపత్రికలు మాసపత్రికలు మొదలగునవి 11 మాత్రమే వచ్చుచున్నవి. ఈ సంవత్సరము చేర్చిన 42 పుస్తకములతో సహా ప్రస్తుతము గ్రంథాలయమున 1771 పుస్తకములు కలవు. మందిరమునకు అనుదినము సగటున 18రు హాజరు అయిరి. ఈసంస్థ 1916 సం॥రం మార్చి 18వ తేదీని ట్రస్టుగా రిజిష్టరు గావింపబడినది. దీనికి రు 2350 లు మూలధనముగలదు. అందు రు 1450 లు ఈగ్రామపరపతి సంఘములో సాలు 1కి నూటికి రు 5-8-0 చొప్పున ప్రతి ఆరు మాసములకు వడ్డీ యిచ్చుపద్ధతిని, తక్కిన రు 900 లు భూమితాకట్టుమీద సాలుకు నూటికి రు 9 లు వడ్డీచొప్పున బదులివ్వబడినది. ఈవడ్డీని,

సభ్యులిచ్చు చందాయును దీనికి ఆదాయమైయున్నది. అప్పుడప్పుడు ఈ గ్రామ పరపతి సంఘమువారు తమ సముదాయ ప్రయోజనమునుంచి కొంత-విరాళము నిచ్చుచున్నారు. వచ్చే యీ ఆదాయము చాలక, యీ గ్రంథాలయము మేము అనుకొన్నంత - దీని యీడుకు తగ్గ-వృద్ధి కావడములేదు. ధనలేమియొకటి యీ గ్రామము బహుచిన్నది అవడము, మాపూర్వవాసనలు మేము విడువలేక పోవడము ఈ మూడు అడ్డంకులుగా నున్నవని చెప్పకతప్పదు.

ఈ గ్రంథాలయమున కనుబంధముగా రాత్రి పాఠశాల ఒకటి యుండేది. అది ప్రస్తుతము జరుగకపోవుటకు మా యుపేక్షయే కారణము. ఇందు ప్రార్థనాసమాజ మొకటి యున్నది. వారమునకొకసారి దీనిసభ్యులు చేరి ప్రార్థనాదికములు చేయుచుందురు. కీర్తిశేషులగు నారిశెట్టి హనుమయ్యగారు తఱచువచ్చి యీ ప్రార్థనాసమాజమునకు జీవముపోయుచుండెడివారు. కాని వారు లేనిలోటు కనబడుచునేయున్నది.

బీదలకు అన్న వస్త్రదానములు చేయవలసినదిగా కొందరు దాతలు రు 325 ల ఇచ్చి దానిపై వడ్డీనిమాత్రమే ఖర్చుపర్చవలసినదని కోరినారు. అన్నదానము తాత్కాలికమని తోంచి, వస్త్రదానముచేయుట లెస్సయని యూహించి యీసాలున సదరు వడ్డీతాలూకు రు 21-15-0 ఖర్చుతో 26 మంది బీదలకు వస్త్రములు దానముచేయడ మయినది. ఆయుర్వేద ఔషధములు స్వయముగా చేసి గ్రామములో పంచిపెట్టడము జరుగుచున్నది. బీదలకు వస్త్రదానమును, ఉచిత ఔషధసేవయును నిర్విఘ్నముగా జరుగుచున్నవని మనవిచేయుటకు సంతోషముగా నున్నది.

దీపావళిరోజున గ్రామములో నింటింట కొంత విరాళములు వసూలుచేసి బందరు ఆంధ్ర జాతీయకళాశాలకు పంపెడివారు. ఈ సంవత్సరమున కళాశాలవారు దీపావళిచందాలను గురించి యెట్టికోరికలను వెల్లడించనందున ఆ సొమ్ము రు 10 లు గుంటూరు శారదానికేతనము వారికి పంపబడినది.

ఈ గ్రంథాలయమున పురుషులకంటె స్త్రీలు ఎక్కువ పుస్తకముల నిండ్లకు తీసుకొని వెళ్లుచున్నారు. దీనిమూలధనము లెక్కువ మొత్తము స్త్రీలనుండియే వచ్చినవి. కాని ఘోషాయనెడి ఘోరపిశాచము మమ్ములను ఎదుర్కొని ముందునకు వెనుకకు వెళ్లనీయకుండ చేయుచున్నది. ఈమె పెద్దక్కయ్య అస్పృశ్యత అంతకంటె వికృతరూపముతో నున్నను వయస్సుమళ్లిన కారణముచే కాబోలు, కొంతలొంగుబాటుపడువచ్చు సూచనలు కనబడుచున్నవి. మా భయంకర విశ్వాసములకు అదురుచు చెదురు హరిజనులు లనుదినము కాకపోయినను అప్పుడప్పుడువచ్చి యీ గ్రంథాలయమును పవిత్రమొనర్చుచున్నారంటే వీరేశలింగంగారిపేరు పెట్టినందుకు వృథా కాలేదు కాదాయనునూహ పిచ్చిదికాకపోలేదు.

శ్రీయుత నరసింహదేవర సత్యనారాయణగారును, అవ్వారి హనుమయ్యగారును ఈ గ్రంథాలయమును దర్శించి వారియభిప్రాయములను చూపరులబుక్కులో వ్రాసియున్నారు.

గ్రంథాలయపు జమాఖర్చులను తనిఖీచేయుటకు కలిదిండి వెంకటనరసింహరాజుగారిని నియమించినారు. వారు తనిఖీచేసినారు ది16-8-34వ తేదీని సమాజమువారు జరిపిన సాధారణసభలో సమాజపు మెంబర్లలోనుండి కార్యనిర్వాహక సభ్యుల నెన్నుకొనిరి. సదరు సభలో సమాజపు

మెంబర్లుకాని సాగి బంగార్రాజుగారు వగయిరా 4గురినిహాజరువ్రాయుట సరియైనపద్ధతికానేరదు. ఎన్నికలలోవారి కెట్టి సంబంధము నుండరాదు. ఇంతటినుండియైన నట్టి యలవాటు తగ్గించుట మంచిది.

సమాజమువారు చేయువార్షికోత్సవపుఖర్చులు, ప్రయాణపుఖర్చులు, పత్రికఖర్చులు, ఔషధపు ఖర్చులు వగైరాకు సంవత్సర ప్రారంభములో సమాజపు మెంబర్లు కూడిన మహాసభలో బడ్జెటు శాంక్షను పొంది, శాంక్షనుకాబడిన మొత్తమునకు మించకుండ ఖర్చు పెట్టదగును. ఒకానొకచో దానిలోనిమొత్తము మరియొక దానికి ఖర్చు పెట్టినచో తిరుగ నా మొత్తమునకు సభవారియామోదమును పొందుచుండవలెను.

ఓచర్లకు వరుసనెంబరునిచ్చి వరుసక్రమము తప్పక ఫైలుబుక్కులో అంటించుచుండవలెను.

1-1-35, కుమదవల్లి.

కలిదిండి వెంకటనరసింహరాజు.

జమా ఖర్చులు.

| జమలు. | రు-అ-పై |
|---|---|
| ప్రారంభపు నిల్వ | 43- 5-3 |
| బదుళ్లు | 94- 0-0 |
| మూలధనము. బా. జమలు | 1545- 3-0 |
| మెంబరుచందాలు | 31- 0-0 |
| దీపావళినాడు గ్రామములో వసూలు విరాళము | 10- 5-0 |
| పరపతిసంఘసముదాయ ప్రయోజనపుఫండు | 20-12-0 |
| | 1744 -9-3 |

| ఖర్చులు. | రు-అ-పై |
|---|---|
| గతవార్షికోత్సవపుఖర్చులు | 9-10-3 |
| కిరసనాయిలు వగైరా | 8- 1-6 |
| దీపావళివిరాళములు శారదానికేతనమువారికి పంపినది | 10- 2-0 |
| మహాత్మాగాంధిగారి ఫోటోనిమిత్తము | 10- 0-0 |
| పత్రికలు | 54- 8-6 |
| పుస్తకములకు | 8- 1-6 |
| పోస్టేజీ | 6- 0-9 |
| స్టేషనరీ | 7- 9-0 |
| బదుళ్లు తీర్చినవి | 96-13-0 |
| జీతము (సిబ్బంది) | 5- 6-0 |
| ఔషధములు | 18-14-6 |
| బీదలకు వస్త్రదానము | 21-15-0 |
| పరపతిసంఘములో డిపోజిట్టు | 1450- 0-0 |
| శ్రీకృష్ణజయంత్యుత్సవము | 7-15-8 |
| చిల్లా నిల్వ | 34-13-0 |
| | 1744- 9-3 |

భూ. రామమూర్తిరాజు,
కార్యదర్శి.

# పట్టుశాలి.

పట్టుశాలి సంఘాభివృద్ధికై ప్రకటింపబడు జాతీయమాసపత్రిక. సంవత్సరచందా రు 1-8-0.
బొంతలకోడూరు, చీకాకోల్.

# గ్రంథాలయాలు

ఎస్. నరసింగరావు.

### ఉచితగ్రంథాలు

సాధారణంగా చాల గ్రంథాలయాల నిర్వాహకులు ఉచితంగా వారి గ్రంథాలయాలకు గ్రంథాలు ప్రసాదించవలయునని గ్రంథకర్తలకూ, గ్రంథప్రకాశకులకూ, విజ్ఞప్తులు పంపుతుంటారు. అసలు తెనుగుదేశంలో గ్రంథకర్తలు వారి గ్రంథాలు అమ్ముడుపోక, ఆదరణలేక బాధపడుతున్నారు. అలాంటివిషయంలో వారిని ప్రోత్సహించడానికి మీరు ఉచితంగా పోష్టుఖర్చులుకూడ పెట్టుకొని గ్రంథాలు పంపమనడం అన్యాయమైనా మన గ్రంథాలయాధికారులకు తోచకపోవడం శోచనీయం. ధనములేని పేదగ్రంథాలయం కాబట్టి మమ్ము ఆదరించాలంటారు. కాని చదరంగం బల్లలకూ, ఉపాహారం విందులకూ, వార్షికోత్సవాల వేడుకకూ, మితిలేనిధనం వ్యయం చేస్తారు. ఆధనం గ్రంథాలు కొనడంకోసం వినియోగిస్తే ఎంతో బాగుండేది. వెలువడే ప్రతి మంచి తెలుగుగ్రంథమూ తెనుగుదేశంలోని గ్రంథాలయాలన్నీ కొంటే చాలు- ఎంతో మంచి గ్రంథసముదాయం ఇప్పటికి ప్రచురమయ్యేది. గ్రంథాలయాల్లోకూడా మంచిగ్రంథాలే ఉండేవి. అల్లాకాకుండా ఉపయాచనవల్ల లభించే గ్రంథాలలో చాలవరకూ మంచిగ్రంథాలు కాకపోవడంచేత పాఠకులు లేకుండా, వేడుకలతోనే సాగుతున్నవి ఇప్పటి మన గ్రంథాలయాలు. నిజంగా గ్రంథాలయం వృద్ధికావాలంటే అందులో మంచిగ్రంథాలు చేర్చడంలో ఉంటుంది. లభించే కాస్తధనమూ ఇతర వేడుకలకు వినియోగించడమూ, గ్రంథాలు యాచించడమూ ఈనాటి చాల గ్రంథాలయాలకుసిగా వృత్తి.

ఇకముందయినా తెనుగుదేశంలో ఈ దుస్థితి మారాలి. లభించే ఏమాత్రము ధనమయినా గ్రంథాలు కొనడానికే వినియోగించాలని నా గ్రంథాలయ సోదరులను వేడుతున్నాను. గ్రంథాలయాల కొంతమాత్రమూ ఉచిత గ్రంథాలు పంపవలదని గ్రంథకర్తలనూ, ప్రకాశకులనూ వేడుతున్నాను.

—సత్యవాణి.

---

# శ్రీ శారదా గ్రంథ పఠనాలయము,

## హిందూపురము.

# వార్షిక నివేదికలు.

భగవదంశసంభూతులును, జ్ఞానానందస్వరూపులును, కరుణామయులును నగు భక్తశిఖామణులారా!

మనకు పరమోదారుడగు పరమేశ్వరుడు అనన్యసామాన్యంబగు జ్ఞానమును ప్రసాదించి యున్నాడు. ఈ జ్ఞానంబుచే దుఃఖంబుల బాపుకొని, యానందంబు సంపాదించినగాని, మనము కృతార్థత నొందజాలము. ఈ ఆనందము ఐహికమనియు, ఆముష్మికమనియు, ఆధ్యాత్మికమనియు, మూడు విధములుగా నున్నది. ఇందు ఐహికానందము అత్యల్పము, దుఃఖాయాససాధ్యము, దుఃఖమిశ్రము, అశాశ్వతమునై యున్నది. ఆముష్మికానందమును నించుమించుగా నిట్టిదనియే చెప్పవచ్చును. ఆధ్యాత్మికానందము అనల్పము, సులభసాధ్యము, పరిపూర్ణము, నిరతిశయము, శాశ్వతము. కాన నట్టియానందమును పొందుటయే వివేకముగల మనుజునికి ముఖ్యధర్మమై యున్నది. ఇట్టి యఖండానందము అఖండసచ్చిదానందమూర్తిధ్యానముచేతనే లభ్యము కాని, వేరువిధమున గాదని "నిదిధ్యాసితవ్యః, నాన్యః పంథా విద్యతేఽయనాయ" మొదలగు వేదవాక్యములు బోధించుచున్నవి. ఇట్టిధ్యానమార్గమును బోధించుటకే ఈ క్రింద కనబరచబడు సంస్థలు నెలకొల్పబడినవి.

తొలుత 1927 సంవత్సరము జనవరి 2 వ తేదిన శ్రీ శారదా గ్రంథపఠనాలయము కేవల విద్యార్థిసంఘ ప్రోత్సాహముచే ప్రారంభింపబడెను. క్రమక్రమముగ అయ్యది శారదకృపచే నొక సంవత్సరమునకే పౌరుల పోషణమునకు పాత్రమై కొంత యభివృద్ధిగాంచి, తన ప్రథమ వార్షికోత్సవమును శ్రీ. శ్రీ. బ్రహ్మశ్రీ విద్వాన్ ఆలపాటి వెంకటేశ్వర శాస్త్రిల (హైస్కూలు ఆంధ్రపండితులు) వారియధ్యక్షతక్రింద వైభవముగానే జరుపుకొని పెద్దలయాశీర్వాదము బడసెను. అప్పటి ఆశీర్వాదబలమున మన శారద తన రెండవ సంవత్సరమున ఎట్టి తొందరలు లేక మిక్కిలి ప్రకాశవతియై అన్నివిధముల నభివృద్ధి గాంచి పౌరులందరి సంపూర్ణానురాగమునకు పాత్రురాలై తన ద్వితీయవర్షోత్సవము అతివిభవముగా సంస్థయొక్క పోషకులుగా నుండిన బ్రహ్మశ్రీ లోకర్ల గంగాధరశాస్త్రిల (బార్ బ్యాంకు కార్యదర్శి) వారి అధ్యక్షతక్రింద జరుపుకొని ప్రకాశించెను. అంతటితో లోకధర్మము ననుసరించియేమో కాని మన శారద దుష్టబాలగ్రహవీక్షణకు లోనై కొంత కొంత అశక్తతను జెంది క్రమముగా క్షీణించుచు వచ్చెను. అవిధమున నీశ్వరునికృపవల్ల శారద తన ఆరవయేట "శ్రీ సనాతనధర్మసంవర్ధినీసభ" యను పేర స్థాపింపబడిన తన సోదరిజన్మోత్సవమును, తదభివృద్ధిని గాంచి తొల్లింటి ఆరోగ్యమును పొందుచు వయోవృద్ధులును, జ్ఞానవృద్ధులును అగు సభాసభ్యుల అకళంకమైన భక్తికటిమకు పాత్రురాలై అలరారుచున్న దని మనవి చేయుటకు మిక్కిలి సంతసించుచున్నాము.

ఇట్టివిద్యాసంస్థలను వీథి కొక్కటి చొప్పన యేర్పరచి పౌరుల భాషాప్రపంచవిజ్ఞానమునకు తోడ్పడుట పురపాలకసంఘమువారి విధ్యుక్తధర్మ

మైయుండియు 1930 సం॥ నుండి యిదివరకు, అధికములేకున్నను, అంతకుముందు రెండుసంవత్సరములుగా నొసంగుచున్న ఏబది రూప్యములయినను, యీవిద్యాసంస్థకు నిరాఘాటముగా నొసంగుటకు అశక్తమై యున్నదనిన మిగుల విచారింపవలసినవారమై యున్నాము. జిల్లా కంతకును గొప్పపురపాలకసంఘముగ నుండి, యితరములైన అభివృద్ధిమార్గములందు ఎంతటివ్యయప్రయాసలకునైన లోనై ముందంజ వేయుచున్న యీ పురపాలకసంఘము, ఎన్నరో శాఖాసంస్థల కార్యక్రమములచే పౌరుల భాషాప్రపంచ ఆధ్యాత్మికవిజ్ఞానములకు ఆలవాలమై సేవజేయుచున్న యీవిద్యాసంస్థ కిదివరకు నొసంగుచున్న ఏబదిరూప్యములైన నొసంగిన హిందూ పురపాలకసంఘపు గొప్ప ఆయవ్యయపట్టిక ఈ అత్యావశ్యకమగు స్వల్పవ్యయముచే నెట్టియార్థికదుస్థితికిని పాల్పడదని విన్నవించుచున్నాము.

1931 సంవత్సరమున పుష్పవీథి విడిచి కోటలో శ్రీ కందూరి లక్ష్మయ్యగారి శ్రీ రామభజనమందిరమును ఆశ్రయించితిమి అచ్చట కాలక్షేపము చేయుచు ఆసంవత్సరమున భజనమందిరమున నొక ఉచిత హిందీపాఠశాలను ప్రారంభించితిమి. పాఠశాలకు ప్రథమమున 15 మంది విద్యార్థులు చేరి హిందీభాషాభ్యాసము చేయుచు వచ్చిరి. అందలివిద్యార్థులలో కొంద రిప్పుడు రాష్ట్రభాషాపరీక్షల తరగతులవరకు అభ్యాసముచేసి పరీక్షలం దుత్తీర్ణులైరి.

రెండుసంవత్సరములుగా దక్షిణభారతహిందీ ప్రచారకసభా పరీక్షాకేంద్ర మిచట స్థాపింపబడియున్నది. హిందీపరీక్షలు రాష్ట్రభాషాపరీక్షవరకు సంవత్సరమునకు రెండుమార్లు జరుపబడుచున్నవి.

ఏదినమున తన ఆరవ సంవత్సర వర్ధంత్యుత్సవమును శ్రీరాములవారిసన్నిధానమున నెరవేర్చుకొనినదో ఆనాటినుండి మా శారద ఆ జగద్బాంధవుడగు శ్రీరాములకృపాకటాక్షమున ఆరోగ్యవంతురాలై నూతనవికాసము నొందుచు మరల 10-3-32 నుండి పుష్పవీథిని ప్రవేశించి తనకార్యక్రమమును యథావిధిగా కేవలము సంస్థాపకులగు కార్యదర్శిగారిపట్టుదలచేత జరుపబడుచు పౌరులకు పత్రికా పఠనావకాశము కలిగించుచుండెను.

ఇంతలో మనశారద భావిభాగ్యోదయమున 3 సం॥ క్రితమే సంకల్పించినట్టి "శ్రీ సనాతన ధర్మసంవర్ధనీసభ" అను సోదరీ రత్నపు జన్మోత్సవము 1932 సం॥ జులై 3 వ తేదీన కన్నులపండువుగా నానందించిన దని వ్రాయుట కెంతయు సంతసించుచున్నాము.

ఇయ్యది శ్రీశారద గ్రంథపఠనాలయాధ్యక్షులగు శ్రీమాన్ శిరోమణి టి. వి వరదాచార్యులు (ఉన్నతపాఠశాలా గీర్వాణభాషా పండితులు) వారిచే స్థాపింపబడి తత్ప్రారంభోత్సవము శ్రీ వేంకటేశ్వరాలయమున 3-7-1932 తేదికి సరియైన శ్రీముదాంగిరసనామ సంవత్సర ఆషాఢ బ॥ అమావాస్య భానువారము సాయంకాలము 7 గం॥లకు అధ్యక్షులుగానుండి ఉత్సాహముతో జరిపిరి. ఆనాడు సభాకార్యక్రమ విధానమును, సభోద్దేశములను సభ్యులకు దెలుపుచు ఆరోజు కేవలము (ప్రారంభింపబడినరోజుయొక్క ఉత్కృష్టమైన శ్రేష్ఠత్వమును త్రివిధముగా ఉపమాన బాహుళ్యములో శ్లాఘ్యతమమైన ఉపన్యాసముచే సభ్యుల ఆధ్యాత్మికశక్తుల ప్రోత్సాహమునకు బీజముల నాటిరి.

## ఆదివార సభలు.

నాటినుండి నేటివరకు ఒక్కటే యుత్సాహముతో ప్రతిఆదివారము తప్పక శ్రీవెంకటేశ్వరాలయమునందే సమావేశము జరుపబడుచున్నది. ఇదివరకు అట్టిసభలు 49 జరిగినవి. వానియందిదివరకు ఈక్రిందివిషయములను విపులముగా త్రివిధ దృష్టులతో పరిశీలించి సభ్యుల ఆధ్యాత్మికవిజ్ఞానమును వికసింపజేయగలిగినట్టి సంఘాధ్యక్షులవారిశక్తి అనన్యసామాన్యమని చెప్పక తప్పదు. అట్టివారి మహోపకారశక్తికి, వారి హితము ననుసరించి బద్ధాంజలులమై నడచుకొని పరమేశ్వరునికృపకు పాత్రులై కృతజ్ఞతా పూర్వకవందనశతంబు లర్పించుటకన్న మరేవిధమునను వారికి తృప్తిని గలిగింపజాలము. అయినను ఇట్టి అద్భుత వివిధ వేదాంతోపన్యాసములచే నాకర్షింపగలిగినట్టి అధ్యక్షులవారికి "ఉభయవేదాంత ప్రవర్తకాచార్య; వివిధవిద్యావిశారద; ఉపన్యాసకేసరి" అను బిరుదములను కృతజ్ఞతాభివందనములతో సమర్పించి కృతార్థులగుదుముగాక.

ఇతర కాలక్షేపములు:—ఆదివార సభలందు జరుపబడు ఉపన్యాసకాలక్షేపములేకాక సంగీత హరికథాది కాలక్షేపములును, యోగవ్యాయామ, గణితప్రదర్శనములును గతవత్సరమున శ్రీవెంకటేశ్వరాలయముననే జరుపబడెను.

## ఉత్సవములు పురాణకాలక్షేపములు.

ఉత్తర గోగ్రహణము, వామనచరిత్ర, శమంతకమణ్యుపాఖ్యానము, నరకాసురవధ మొదలగు చరిత్రలు పురాణకాలక్షేపములుగా నేర్పాటు గావించి పురాణములందు నిజముగా గ్రహింపతగిన సారాంశములను త్రివిధములుగా పరిశీలించుచు కాలక్షేపము చేయబడెను.

శరన్నవరాత్రిమహోత్సవములు ఈతూరి అతివైభవముగా ప్రాతస్సాయంకాలములందు ఎడతెగని ఆర్యకృత్యములచే జరుపబడెను. కడపటి దినమున శ్రీ శారదాపటము గ్రామమంతటను ఊరేగింపబడెను.

నూతన శ్రీముఖ సంవత్సరారంభోత్సవము వైభవముతో జరుపబడి తదభివందనసమర్పణము పౌరులకు పంచిపెట్టబడెను.

## ఉపన్యాసవిషయముల పట్టి.

1. సూర్యచంద్రులలోని ఆధ్యాత్మిక తత్త్వము. 2. సనాతన ధర్మస్వరూప నిరూపణము. 3. నిత్య నైమిత్తికాది కర్మస్వరూపము 4. సంధ్యావందనము. (1) అర్ఘ్యప్రదానము (2) గాయత్రీమహిమానువర్ణనము. (3) తారాశశాంకములోని ధ్యానయోగరహస్యము. (4) జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలు యోగులయందుండు పద్ధతి. (5) సంధ్యావందనమంత్రములలోని లౌకిక, ధార్మిక, ఆధ్యాత్మికదృష్టులచే గోచరించు తత్త్వము. (6) సంధ్యావందనమునకు కర్మ, జ్ఞాన, భక్తి, యోగరూపత్వము (7) సంధ్యోపస్థానము, అందలి తత్త్వము. (8) ఉపస్థానము-అందలి భగవత్సాక్షాత్కారయోగము. (9) ఉపస్థానమునకు ధ్రువోపాఖ్యానమునకుగల ఆధ్యాత్మికసామ్యము. (10) ధ్రువచరిత్ర జీవాత్మతో పోల్చి విమర్శించునప్పుడు విశదపడగల ఆధ్యాత్మికాద్భుతరహస్యములు. (11) నారదుడు, ధ్రువున కుపదేశించిన ద్వాదశాక్షరీమంత్రరహస్యములు 5. భగవదవతారములు కర్మవశ్యంబులై అధర్మకలితంబులా? 6. విగ్రహారాధనము అందుకు సంబంధించిన దశావతారముల మూలకథలకు లౌకిక ధార్మికాధ్యాత్మికదృష్టిచే విశదమగు నద్భుతరహస్యములు.

ఛలిగాక పండుగలు, పర్వములు, వాని ఆచరణవిధి, వానికి సంబంధించిన కథలకును, యుగము నాటినుండి గ్రహింపదగిన రహస్యార్థములకును గల పరస్పరసంబంధములు సందర్భానుసారముగా ప్రజలకు తేటతెల్లముగా తెలియపరచబడెను.

### శ్రీ సనాతనాయుర్వేద వైద్యశాల.

మనుష్యజన్మము నానావిధములైన మలములచే నావరింపబడియున్నది. అవి 1. దేహమలము, 2. మనోమలము, ఆత్మమలము, అందులోని 2, 3 విధములైన మలము లిదివరకు పైని వివరించిన సభాకార్యక్రమముచే పోగొట్టవచ్చునుగాని, ప్రథమమున పోగొట్టుకోవలసిన దేహమలమునకు తగుఏర్పాటులు సభామూలమున చేయుదలంచి "శ్రీసనాతనాయుర్వేద వైద్యశాల" యొకటి అధ్యక్షులవారిచే స్థాపింపబడి చిన్నబళ్ళాపుర వాస్తవ్యులగు బ్ర॥ శ్రీ॥ ఆయుర్వేదరత్నాకర పండిత గణేశశాస్త్రులువారిచే సామాన్యముగా నడుపబడుచున్నది. దీనికి తగినంత ప్రోత్సాహము లేమిచే ఎక్కువగా ప్రజల ఆరోగ్యవంతులకు పాటుపడ శక్తిలేకయున్నది. దొరలయుదారప్రోత్సాహమున నీవైద్యశాల అభివృద్ధినై ప్రకాశించుగాత మని కోరుచున్నాము. ఈవిషయమున హిందూపుర పురపాలకసంఘమువారు గొప్పవిరాళము నొసంగి హిందూపురమున ఆయుర్వేద వైద్యశాల తెరిచి లోపమును పోగొట్టుదురని నమ్ముచున్నాము.

### ప్రచారము, సంచారము.

ఈ సభాప్రచారనిమిత్తమై తదుద్దేశమునను సరించి చిన్నబళ్ళాపురము, జాతవరము, బెంగుళూరు కంటోన్మెంటు, తిరుపతి, గుడివాడ, బెజవాడ, రాజమండ్రి మొదలగు స్థలములకు వెళ్ళి వేదాంతోపన్యాసములొనరగి ప్రచారము సలుపబడెను.

### ప్రచురణములు.

1. భగవదవతారములు కొన్నికల్పితపురాణగాథల ననుసరించి కర్మవశ్యంబు లనియు, అధర్మసంకలితంబు లనియు పౌరాణికుల పూర్వపక్షమునకు అవతారములు కర్మవశ్యంబులు కావనియు ధర్మసంస్థాపనార్థమైనందున అధర్మకలితంబులు కావను అంశంబుల నుపన్యసించుచును, శ్రీమాన్ వావిలికొలను సుబ్బారావుగారినుండి ఈవిషయమున వచ్చినజవాబును, అచ్చొత్తించి ప్రకటించుచును ప్రత్యుత్తరమొసంగి నిర్ణయింపబడెను.

ఈసందర్భమున అధ్యక్షులవారిచే రచియింపబడిన "భగవదవతారములు కర్మవశ్యములై, అధర్మకలితంబులా?" అను 10 పేజీల పుస్తకము ప్రచురింపబడెను.

### భగవద్ధ్యాన సోపానము.

ఆదివారసభలయందుపన్యసించినట్టి సంధ్యావందనవిషయములో కడపటి యుపస్థానమంత్రరహస్యమునుగూర్చి చెప్పుచు అధ్యక్షులవారు ధ్రువోపాఖ్యానమును అత్యద్భుతమైన ఆధ్యాత్మికరహస్యములతో, త్రివిధదృష్టితో సమర్థించుచు, ధ్రువునకు భగవంతుడు సాక్షాత్కారమగు భాగమును పై ఉపస్థాన మంత్రమునకు సరిపోల్చుచు, భగవత్సాక్షాత్కార యోగము, వారిచే రచియింపబడి సభాపోషకులగు శ్రీయుత గ్రంధిగం కాశప్ప శ్రేష్ఠిగారు వారి మాతాపితరుల జ్ఞాపకార్థమై యొసంగిన ద్రవ్యసాహాయ్యముచే అచ్చొత్తించబడిన "భగవద్ధ్యాన సోపానము"లోని అద్భుతధ్యానశ్లోకములచే ప్రత్యక్షపరచి సభ్యుల నానందసాగరమున నోలలాడించిరని వ్రాయుట కలవికాదు గాని ఆనాడట్టియానందము ననుభవించినవారికే యిది విస్పష్టము.

## అభిమానులు పోషకులు.

4 సం॥ల ఒట్టు ఖర్చులలో గ్రంథాలయపు ఆస్తిగా రు 94-0-6 ఖరీదుగల పుస్తకములను మాత్రము చేర్చగలిగితిమి. ముందు అభిమానుల ప్రోత్సాహమున గ్రంథాలయ మభివృద్ధి జెందగలదని నమ్ముచున్నాము. గుడివాడ కాపురస్థులగు శ్రీయుత టి. జి. కృష్ణమూర్తిగారు సభాకార్యక్రమములు పత్రికలో చూచినంత మాత్రముననే ఆనందపరవశులై అయాచితముగా రు 25-0-0 విరాళముగా పంపిరని పాఠకలోకమునకు తెలియజేయుటకు మిక్కిలి సంతసించుచున్నాము. వీ రింకను కొన్ని పుస్తకములను గ్రంథాలయమునకు నొసంగిరి. మరియు దాసా కృష్ణయ్యగారు, గోరంట్ల వెంకటేశయ్యగారు, గోరంట్ల వెంకటరమణయ్యగారు, దాసా నరసింహయ్యగార్లు గ్రంథాలయమునకు పుస్తకములు, కొంత విరాళమును చెల్లించి గ్రంథాలయాభివృద్ధికి మార్గదర్శులైరి. ఈవిధముననే ఎల్లరు ముఖ్యావశ్యకమైన యీ గ్రంథాలయమును పెంపొందించుటకు తోడ్పడ కోరిక.

## కృతజ్ఞతానివేదనము.

పత్రికలో మా కార్యక్రమ మవలోకించిన మాత్రమున మిక్కిలి ఆనందపరవశులై సభారాజపోషకులును, సభాప్రథమబంధువులునైనట్టి శ్రీయుత టి. జి. కృష్ణమూర్తిగారికిని, (గుడివాడ) గ్రంథాలయాభివృద్ధికి సాహాయ్యము చేసిన ఉదారులకును, సభాకార్యక్రమములందు తోడ్పడుచున్న భక్తశిఖామణులకును, శ్రీ సనాతనాయుర్వేదవైద్యశాలలో వైద్యులుగా నుండి ఉచితముగా సేవజేయుచున్న బ్ర॥ శ్రీ గణేశశాస్త్రులవారికిని, కోరినంతనే ఎంతటిమార్గాయాసమునకునైన లోనై విచ్చేసి మృదుమధుర గానప్రదర్శనములచే అప్పుడప్పుడు సభ్యులను నానందసుఖమున నోలలాడించు గాయకశిఖామణి శ్రీమాన్ శే. శేషాచార్యులవారికిని (తిరుపతి), ఉపన్యాసములకు కాలక్షేపములకు ప్రదర్శనములకు తప్పక వచ్చు శ్రద్ధాళులకును, మా చిన్న బాలికలగు శ్రీ శారదా, సనాతనధర్మ సంవర్ధినీ సంస్థల పరముగా కృతజ్ఞతాభివందనము లర్పించుచు, కలకాలము మీ అనన్యకరుణాప్రసారము లెల్లప్పుడును ఈ మీ బిడ్డలకడ ప్రసరింపజేయుచు, పరమేశ్వరుని కృపాకటాక్షమునకు పాత్రులై చిరాయురారోగ్యైశ్వర్యవంతు లగుదురుగాక యని ప్రార్థించుచున్నారము.

## ముఖ్యోద్దేశములు.

1. ధార్మికాధ్యాత్మిక సాంఘికవిషయముల నుపన్యాసమూలమున చక్కగ బోధించుట.

2. పై సభయందొసంగబడు శ్లాఘ్యతమోపన్యాసములను క్రమపరించి యాంధ్రలోకమున కొసంగుట.

3. ఆధ్యాత్మిక సారస్వత సాంఘిక విషయముల జక్కగా విమర్శించు 'భారతోల్లాసిని' యను మా సభాపత్రికను ప్రచురించుట.

4. శ్రీ సనాతనాయుర్వేదవైద్యశాలను నెలకొల్పుట.

5. జనులయందడుగంటినమతాభిమానము నుద్ధరించుట.

6. హిందూ మతవర్ణాశ్రమాచారము లన్నిటికిని లౌకికాధ్యాత్మిక ప్రయోజనములను నిరూపించుట.

7. పురాణములపై మనవారిచేతను, అన్యమతస్థులచేతను, నారోపింపబడు నాక్షేపములకు సక్రమంబులగు సమాధానంబుల విశదపరచుట.

8. సంధ్యావందనాది నిత్యనైమిత్తికకర్మల యందు దుపయుక్తమంత్రములకును, పౌరాణిక సకలచరిత్రంబులకు లౌకికధార్మిక ఆధ్యాత్మికము లను త్రివిధదృష్టితో పరిశీలించిన విశదమగు నద్భుత రహస్యార్థములు తెలుపుట.

9. ఆంధ్ర గీర్వాణ సారస్వతముల నుద్ధరించుట.

10. ఈదేశమున గల గొప్ప పండితుల రావించి వారిచే పైవిషయములయందుపన్యాసముల నిప్పించుట.

11. ఇట్టి సనాతన ధర్మప్రబోధములను ఇచ్చుటనే కాక దేశమున నల్లెడ గావించుట.

12. ఈ సభయొక్క శాఖాసభలను ఇతర స్థలముల నెలకొల్పుట.

13. పై విషయముల కనుకూలమగు నొక గ్రంథాలయమును, పఠనాలయమును స్థాపించుట.

పైవిషయములయం దెవరి కేలాటిసంశయములు కలిగినను, మమ్మడిగిన సభాముఖమున శాస్త్రీయములగు సమాధానంబుల నొసంగగలము కాన వారివారి సందేహములనడిగి సదుత్తరంబులు పొందుటకు ప్రార్థించుచున్నాము.

1930, 1931, 1932 వ సంవత్సరముల ఆదాయవ్యయ పట్టిక:—

| జమల వివరము | | ఖర్చుల వివరము | |
|---|---|---|---|
| 1930 సం॥ జనవరి మాసారంభమున నిలువ | 36- 7-3 | ఆఫీసు ఖర్చులు. | 158-12-8 |
| చందాలు, విరాళములజమలు | 167-15-6 | పత్రికలకు | 27- 4-6 |
| కార్యదర్శిగారు ప్రతి సం॥ పోషకచందా 12-0-0 కు పైబడి యొసంగుచున్న సాహాయ్యము కాక వారినుండి సభాకార్యక్రమములకు (1932వ సం॥న) తీసుకొన్న నగదు జమ | 68- 4-0 | ప్రింటింగ్ | 32- 5-0 |
| అధ్యక్షులవారియొద్దనున్న నగదు | 15- 0-0 | గ్రంథాలయమునకు పుస్తకములు కొన్నది | 54- 8-0 |
| | | అధ్యక్షులవారియొద్ద నిలువ | 14-12-7 |
| మొత్తం జమ | 287-10-9 | మొత్తం ఖర్చు | 287-10-9 |

శ్రీమాన్ పండిత శిరోమణి
టి. వి. వరదాచార్యులు,
అధ్యక్షులు.

బ్ర॥ శ్రీ విద్వాన్ గబ్బిట మృత్యుంజయశాస్త్రులు,
ఉపాధ్యక్షులు.

ఇట్లు, దాసోహం,
కందాడై భాష్యం.
కార్యదర్శి.

# విద్యా-సంస్కారము.

"విద్య" యన జ్ఞానము. అట్టిజ్ఞానమును పుస్తకములనుండియు నేర్చుకొనవచ్చును. ప్రపంచమునుండియు నేర్చుకొనవచ్చును. కేవలము పుస్తకజ్ఞానము గలవారు ప్రపంచమున బనికిరానివా రగుచున్నారు. కేవలము ప్రపంచజ్ఞానము గలవా రక్కరకు వచ్చుచున్నారు. రెంటియొక్క సమ్మేళన మందునెడల బంగారుకు తావి యబ్బినట్లగును. ఇయ్యది చేకూరు టెట్లను విషయము యోచింపదగును. విద్యావిధానమునందే యీరెంటి సమ్మేళనము గావలసియుండును. పుస్తకములందలి పాఠముల నేర్పుటలో నిపుడు ప్రత్యేక బోధనాపద్ధతివలన నియ్యది కొంతవఱకు జేకూరుచున్నది. కాని ముఖ్యమైనది సంస్కారము. ఆ సంస్కారము గల్గినవారు రాణింపగలరు. లేనివారివిషయమే యాలోచింపవలసియున్నది. సంస్కారము గలవారు స్వయంశక్తి గల్గినవారు. వారి కితరసహాయము లక్కరలేదు. జనసామాన్యము మాటయే చింతనీయము. కావున గ్రంథాలయములు ముఖ్యముగా జనసామాన్యముయొక్క సంస్కారాభివృద్ధికై నిరంతర కృషిసల్పి అజ్ఞాన తిమిరమును దొలగించి మానవకళ్యాణమునకును దేశకళ్యాణమునకును దోడ్పడవలయును.

---

# దక్షిణభారత గ్రంథాలయోద్యమము *

(తుర్లపాటి రాజేశ్వరమ్మగారు)

అనాదినుండియు స్త్రీలను సమానగౌరవ ప్రతిపత్తులతో జూచుచుంట భారతదేశ సంప్రదాయమై యున్నది. విద్యారంభమున సరస్వతీపూజ చేయుట హిందూమతాచార మగుటచే స్త్రీ కట్టిస్థానము ఈ దేశమున నివ్వబడినదో చెప్పక చెప్పుచున్నది, గనుక నా యర్హతను బట్టి గాక స్త్రీసంఘమునెడ గల యభిమానముచేతనే మీ యందరకును స్వాగతమిచ్చు భాగ్యము నాకు లభింపజేయబడినది. అందులకు ఆహ్వానసంఘము వారికి వందనములు.

దక్షిణ హిందూదేశమున ముఖ్యముగ తెలుగు, తమిళము, మళయాళము, కన్నడము భాషలు గలవు. ఈ భాషలు మాటలాడువా రందరును ఒకేరాష్ట్రమగు చెన్నరాజధానిలో చేర్పబడియున్నను, వ్యవహార సౌకర్యార్థము పెద్దలు భాషలనుబట్టి రాష్ట్రవిభజనము చేసియున్నారు. దొరతనమువారినిగూడ నీ విభజనము సేయ నంగీకరింపగోరుచున్నారు. గ్రంథాలయోద్యమము ప్రజల కందరకు నందుబాటు కావలయునన్న భాషలనుబట్టి యేర్పరుపబడిన రాష్ట్రవిభజనసూత్రమునే ప్రాధాన్యముగ జేసికొనవలయును. ఆ సిద్ధాంతము నంగీకరించియే ఆంధ్రులు, తమిళులు, మళయాళులు, కర్ణాటకులు గ్రంథాలయోద్యమమును నడుపుచున్నారు. 1885 వ సంవత్సరమున ఆంధ్రదేశమున గ్రంథాలయముల యేర్పాటు ప్రారంభమైనను 1914 వ సంవత్సరమున ఆంధ్రదేశగ్రంథాలయ సంఘస్థాపన చేయబడి తదాది నేటివరకు

---

* ప్రథమదక్షిణభారత గ్రంథాలయోద్యమ సమ్మేళన ఆహ్వానసంఘాధ్యక్షులుగా ఇచ్చిన ఉపన్యాసము.

పదునారు ఆంధ్రదేశ గ్రంథాలయమహాసభలు జరుపబడినవి. సంఘస్థాపనకేమి, ఆంధ్రదేశమున గ్రంథాలయోద్యమము వ్యాపింపజేయుటకేమి, కీర్తిశేషులగు బ్రహ్మశ్రీ సూరి నరసింహశాస్త్రి గారును, అమితోత్సాహముతో నహర్నిశములు ఇప్పటికిని పనిచేయుచున్న మహారాజ రాజశ్రీ అయ్యంకి వెంకటరమణయ్య పంతులు గారును ఏవిధముగ తోడ్పడినది చెప్పుట చర్వితచర్వణము. గ్రంథాలయోద్యమముపట్ల హిందూదేశము నంతటిని మేల్కొల్పినది నరసింహశాస్త్రిగారే యనుట యతిశయోక్తి గానేరదు. వారలకు ఆంధ్రు లెల్లప్పుడును కృతజ్ఞులు.

సుమారు నాలుగు సంవత్సరముల క్రిందట కేరళదేశ గ్రంథాలయసంఘము ఏర్పడినది గాని విశేషముగు చలనము జూపుచున్నటుల లేదు. 1928 వ సంవత్సరమున ప్రథమ కర్ణాటక గ్రంథాలయ మహాసభవారు ధార్వారునందు శ్రీ॥ శ్రీ॥ సూరి నరసింహశాస్త్రులుగారి అధ్యక్షతక్రింద జరిగినదేగాని ద్వితీయసమావేశము జరిగినటుల తెలియుటలేదు. ఈ సంవత్సరమే తమిళనాడు గ్రంథాలయసంఘము ఏర్పడి జూనునెలలో రాష్ట్రసభ జరుగు నేర్పాట్లు చేయబడుచున్నవి. ఈ వివిధరాష్ట్ర గ్రంథాలయసంఘము లన్నియు నికముందు దినదినాభివృద్ధినొందగల వని యాశించుచున్నాను.

పై దెలిపిన రాష్ట్రసంఘములుగాక పుదుక్కోట, మైసూరు, తిరువాన్కూరు, నిజాము హైదరాబాదు, మొదలుగాగల స్వదేశసంస్థానములలోను, చెన్నపురిలోను గ్రంథాలయోద్యమము అభివృద్ధిలో నున్నది. పుదుక్కోటసంస్థానములో నెనిమిది సభలు జరిగినవి. కొచ్చిను సంస్థానమున సంచలనము లేకపోవుట విచారకరము. శ్రీయుతులు ధర్మవీర్ వామననాయకు, మాడపాటి హనుమంతరావు పంతులుగార్లు 1914 సంవత్సరమునుండి హైదరాబాదు రాష్ట్రమున గ్రంథాలయోద్యమవ్యాప్తికి పాటుపడుచున్నారు. దాదాపు 80 గ్రంథాలయములు యిప్పు డారాష్ట్రమున గలవు. మహారాజావారు మైసూరు రాష్ట్రమున గ్రంథాలయోద్యమము సాగించుచున్నారు.

దక్షిణహిందూదేశమున పైన సూచించిన రీతిని వివిధప్రాంతముల గ్రంథాలయ సంస్థలు పనిచేయుచున్నప్పటికిని అవన్నియు ఒకదానితో నొకటి సంబంధము కలిగి పనిచేయు నవకాశములు లేకున్నవి. సర్వత్ర ఇంగ్లీషు చదువ నేర్చినవా రున్నను వారలసంఖ్య అతిస్వల్పము. తక్కినప్రజలలో చదువనేర్చినవారు వారివారి స్వభాషాపరిచితు లయియున్నారు. ఏయేభాషారాష్ట్రమున ఆయారాష్ట్ర గ్రంథాలయసంస్థలు పనిచేయుచున్నను, ఆయన్ని రాష్ట్రసంస్థలు ఒకదానితో నొకటి సంబంధముగలిగి పనిచేయనిచో గ్రంథాలయోద్యమము ప్రజోపయుక్తము గాజాలదు. మన రాజధానియందున్న వేర్వేరు రాష్ట్రములయందు అనగా తమిళనాడు, కేరళదేశము, కర్ణాటకము, మాతృభాషతక్క యన్యభాషా పరిచయము గాని, యన్యసాహిత్యప్రవేశముగాని, యుండుటరుదు. గ్రంథాలయోపయోగము సంపూర్ణముగా దక్షిణహిందూదేశములోని సర్వజనులకు ప్రయోజనకారి కావలయు ననిన ఒక భాషారాష్ట్ర గ్రంథాలయసంఘము మరియొక రాష్ట్ర గ్రంథాలయసంఘముతో చేయికలిపి కృషిచేయవలయును. తమిళగ్రంథములు ఆంధ్రదేశమునకును, ఆంధ్రగ్రంథములు తమిళనాడునకును అదేవిధముగా నితరభాషా రాష్ట్రకేంద్రములకును సులభముగా దొర్కుగాను

సదుపాయము లుంచుట అవసరము. ప్రతిభాషా రాష్ట్ర కేంద్రగ్రంథాలయ సంస్థకు ప్రపంచ విజ్ఞానము సేకరింపగల ఆంగ్లగ్రంథములు ఆయారాష్ట్రభాషాగ్రంథములు చేకూర్చుటయే సులభసాధ్యముకాదు. అట్టియెడ తక్కిన భాషా గ్రంథసముదాయమును సమకూర్చుట సంభవమగునా? ఈసమస్యా నివారణకొరకే దక్షిణ హిందూదేశమందలి భాషాప్రయుక్తరాష్ట్ర గ్రంథాలయ సమ్మేళనము అవసరమగుచున్నది. దీనికితోడు వివిధ స్వదేశసంస్థాన గ్రంథాలయ సంస్థల సమ్మేళనము కూడ యుండుట అవసరము. ప్రతి స్వదేశసంస్థానమును, భాషారాష్ట్రమును తమ తమ స్వపరిస్థితుల కనుగుణముగ కేంద్రగ్రంథాలయసంస్థ నేర్పరచుకొని నప్పుడు అవన్నియు చేదోడుగ పని చేయగల సమ్మేళన (Federation) యొక్క అవశ్యకత యేర్పడుచున్నది.

ఈప్రథమ సమావేశముయొక్క ఉద్దేశము వివిధరాష్ట్ర గ్రంథాలయ సమ్మేళనము చిరస్థాయిగ జేయుటకే అయియున్నది. అటువంటి సమ్మేళన ముండిన గాని సంఘీభావముండి, ప్రజాసమ్మతముగను, ప్రజోపయోగకరముగను, ప్రజా సంస్థల సహాయముతోను, గ్రంథాలయోద్యమ బీజాక్షరములను ప్రతిపల్లెటూరునందును విరివిగ వెదజల్ల నవకాశములు చిక్కవు. అంతియగాక గ్రంథాలయోద్యమ వ్యాప్తి నరికట్టగల శాసనముల నెదుర్కొని సలహానిచ్చి మంచిత్రోవను శాసనముల నేర్పాటుచేయింప నవకాశ ముండదు. గ్రంథాలయోద్యమము రాజకీయ సంస్థగాని మతసంస్థగాని కాదు. అది కేవలము సాంఘిక విద్యాసంస్థ. జాతిమత భేదములు లేక, బీదవారు భాగ్యవంతులను తారతమ్యము గమనింపక స్త్రీపురుష వ్యత్యాసము గణింపక సర్వజనాంగీకారమై ప్రజల నందరను నాకర్షించి దేశాభ్యుదయకరమగు మహా గొప్పసంస్థగ గ్రంథాలయోద్యమము నడిపింపబడవలయును. ఈయాదర్శము ప్రధానముగ జేసి సర్వశక్తుల దీనిని కేంద్రీకరించుటకు వివిధ వ్యక్తి గ్రంథాలయసంఘములు ఏకకూటముగ జేరి ఒకే సంస్థగా కృషి సల్పవలయును. ఇది దక్షిణ హిందూదేశమందలి అన్ని గ్రంథాలయసంస్థల సమ్మేళనము వలన జరుగగల దని మన యాశయము.

---

# రాజ్యపాలనశాస్త్రము.

(గ్రంథకర్త. శనివారపు సుబ్బారావుగారు; ప్రకాశకులు, విక్రేతలు : సరస్వతీగ్రంథమాల, కాకరపర్రు, తణుకుతాలూకా, పశ్చిమగోదావరి జిల్లా, మూల్యము **1—0—0**. పుటలు : **116**)

వివిధగ్రంథకర్తలగు శ్రీ సుబ్బారావుగా రాంధ్రలోకమునకు చిరపరిచితులే. వారిప్రస్తుతగ్రంథ మాంధ్రసారస్వతములో చిరకాలమునుండియున్న కొఱతను తీర్చుచున్నది. ఈ గ్రంథములో నీ క్రిందివిషయములు సులభశైలిలో మిక్కిలి చక్కగ వివరింపబడినవి: 'రాజ్యపాలనాశాస్త్రము' 'రాజ్యము' 'ప్రభుత్వము' 'సేవను' అనువాని నిర్వచనములు, రాజ్యోత్పత్తి ప్రభుత్వవిధానము, నేటిరాజ్యవిధానములు, ప్రజాప్రభుత్వమందలి విభాగములు, పూర్వరాజ్యపాలనవిధానములు, ప్రభుత్వాధికారవిభాగములు, శాసనసభలు, తత్ప్రతినిధులు, పౌరత్వహక్కు, వోటరు, అధికారవర్గము, ప్రధానాధికారి, న్యాయశాఖ, న్యాయశాస్త్రము, శాసనసభలకు అధికారవర్గమునకు గల సంబంధములు, రాజకీయపక్షములు, ప్రభుత్వ పరిపాలనావిభాగములు, స్థానికపరిపాలన, చట్టవిధానము, క్యాబినెట్టు, పార్లమెంటు, ఇంగ్లండులోని న్యాయశాఖ, అమెరికాపరిపాలనావిధానము, ఫ్రాన్సుదేశపు పరిపాలనా విధానము, జర్మనీపరిపాలనా విధానము, సామ్రాజ్యతత్వము, ఇటలీదేశము, ముస్సోలినీ జీవితచరిత్రము, ఫాసిజము, సోషలిజము, నానాజాతిసమితి, ప్రపంచములో ప్రజాప్రభుత్వరాజ్యములు, వాని వైశాల్యము, జనాభా, వివిధదేశములలోని జాతీయచిహ్నములు, అంతర్జాతీయ కార్మికసంఘము, నిరుద్యోగసమస్య, మన గవర్నరుజనరల్సు.

పొలిటికల్ సైన్సుపై నాంగ్లములో గల వివిధ సుప్రసిద్ధ గ్రంథములసారమే యీ గ్రంథములో పొందుపరుపబడుటచే నిది యాంగ్లము రాని యాంధ్రుల కత్యంతోపకారి కాగలదు. అన్నిగ్రంథములను చదువుటకుతీరిక లేని యాంగ్లవిద్యాధికుడగు నాంధ్రుడుగూడ దీని బఠించి విశేషలాభము నొందగలడు. రాజకీయముల నర్థము చేసికొనుటకును, రాజకీయములలో పాల్గొనుటకును నుత్సహించు ప్రతియువకుడును ననునిత్యము జ్ఞప్తియందుంచు కొనవలసిన విషయములే యీ గ్రంథములో గలవు కాని యిందు పొల్లుమాట యొకటియు గానరాదు. ఆంధ్రులకు రాజకీయవాఙ్మయమున గల కొఱతను చక్కగ గ్రహించి తగురీతిని దాని దీర్చిన శ్రీ సుబ్బారావుగా రభినందనీయులు. ఇట్టి గ్రంథములను రచించుచు చిరకాల మాంధ్రభాషామాతకు సేవలనొనర్చుచుందునట్లు భగవంతుడు శ్రీ సుబ్బారావుగారి ననుగ్రహించుగాక!

(జి. వు.)

---

# తెలుగుపత్రికలు

**సంపాదకులకు విన్నపము:**

ఇదివరలో "తెలుగుపత్రికలు" అను శీర్షికతో ప్రమోదూత వైశాఖ "భారతి" అనుబంధమున దాదాపు 500 కు పైగా తెలుగుభాషలో ప్రచురితమైన, అగుచుండిన పత్రికల సంగ్రహచరిత్రను ప్రచురించియుంటిని. అటులగాక నీ పర్యాయము ప్రస్తుతము పని జేయుచున్న తెలుగుపత్రికల జాబితాను, వీలుండిన చరిత్రాదికవివరములతో ప్రచురింపవలయునని సంకల్పించినాడను. కావున అందరు తెలుగు పత్రికాసంపాదకులను తమ పత్రికల సంగ్రహచరిత్రములను, ఈ క్రిందివివరములకు జవాబులను, మాదిరి సంచికను బంపుటతో బాటి ప్రకటనను దమ పత్రికలలోఁ బ్రచురించి ఆపత్రికల నంపియు నస్మత్ప్రయత్నమున బ్రోత్సహింపఁ బ్రార్థితులు. త్వరలో బంపవలయును.

వి వ ర ము లు.

పత్రికపేరు
స్థాపితమైన తేది
వ్యవధి
పత్రిక ప్రకటితమగు తేది లేక వారము
సంపాదకునిపేరు
ప్రకాశకునిపేరు, ముద్రాశాల
పత్రికోద్దేశములు
చందావివరము
విడిసంచికవెల
చందాదారులసంఖ్య లేక ప్రకటింపబడుచున్న ప్రతులు
ఇతరముఖ్యవిషయములు, సంగ్రహచరిత్ర

వావిలాల గోపాలకృష్ణయ్య,
సంపాదకుడు 'విద్యార్థి', సత్తెనపల్లి.

# గ్రంథాలయ సర్వస్వమునకు చందాలు

ఈనెల 1985 సం॥ ఫిబ్రవరి నెలయందు ఈ క్రింది చందాలను స్వీకరించినారము

(1) డాక్టరు తల్లాప్రగడ సత్యనారాయణమూర్తిగారు, తాడేపల్లిగూడెం
(2) శ్రీ శ్రీ శ్రీ వేంకటేశ్వరవిలాస పుస్తకభాండాగారము, ఉపమాక అగ్రహారము
(3) గ్రామ పంచాయతీబోర్డు, మాధవరం
(4) పోతాప్రగడ శ్రీరామారావుగారు, తణుకు
(5) జనార్దన ఉచితగ్రంథాలయము, తిమ్మసముద్రము
(6) శ్రీ శబ్దానుశాసన ఆంధ్రగ్రంథాలయము, ఓరుగల్లు
(7) దేశోద్ధారక గ్రంథాలయము, కుక్కునూరు
(8) శ్రీ సీతారామకృష్ణ శారదాపఠనమందిరము, వల్లూరుపోష్టు, కడపజిల్లా
(9) గోవిందదాసదేగ్రంథాలయము, లంకలకోడేరు

బెజవాడ, 28-2-85.

అయ్యంకి వేంకటరమణయ్య, పత్రికాధిపతి.

విజ్ఞానచంద్రికయందు ప్రకటింపబడిన

## హిందూ మహాయుగము

కొమర్రాజు లక్ష్మణరావు ఎం.ఏ. గారిచే రచియింపబడినది. వెల రు 1—8—0.

## బౌద్ధ మహాయుగము

వేలూరి సత్యనారాయణ ఎం. ఏ. గారిచే రచియింపబడినది.

వెల క్యాలికోబైండు రు 2—0—0
రేపరుబైండు రు 1—8—0

## జడకుచ్చులు

రాయప్రోలు సుబ్బారావుగారిచే రచియింపబడినది. వెల రు 1—0—0

మేనేజరు,
ఆంధ్ర గ్రంథాలయప్రెస్, బెజవాడ.

---

# ప్రకృతి

ఆరోగ్య సచిత్ర మాసపత్రిక.

ఆరోగ్యనియమములను - మందు, శస్త్రములతో నిమిత్తములేని స్వాభావిక చికిత్సా విధానములను, స్వాభావిక జీవనమును బోధించును. సంవత్సరచందా రు 3—0—0

మేనేజరు,
ప్రకృతి కార్యాలయట్రస్టు, బెజవాడ,

---

# జ్వాల మాసపత్రిక బెజవాడ

విడిపత్రిక ఒక అణా - సం॥చందా రూపాయి

శతాబ్దాల ఆచారం మానసికదాని సత్వంగానూ, మతాభిమానం నల్లమందు మత్తుగానూ అయి, నిస్తేజంగా, నీరసంగా స్వతంత్రత వివిధంగానూ లేని సంఘానికి అలజడి, తిరుగుబాటు, సత్యాన్ని నిండుకన్నులతో చూడగలధైర్యం కావాలి. జ్వాల ఉద్దేశం ఇది.

---

## "విజయ" సచిత్రమాస పత్రిక.

సం॥ చందా రూ1. విడి సంచిక 0-1-6.

హాస్యరసోపేతము విజ్ఞాన సర్వస్వము. ఒక చరిత్ర - ఒక రసము - ఒక పరిశ్రమ ఒక పరిశోధన - ప్రకటించినది ప్రకటించకుండా ప్రకటించేది "విజయ" ఒక్కటే. సంచికంతయునచిత్రమే. ప్రతివిలేఖరియు సుప్రసిద్ధుడే. మిమ్ములను నవరసతరంగిణిలో ముంచెత్తుతుంది. ఇన్నివిషయములు చర్చించు పత్రిక యింత స్వల్పమూల్యమునకు చిక్కదు.

వివరములకు:—విజయ కార్యాలయము, విజయనగరం.

---

# హిందూసుందరి

ఇది కాకినాడ విద్యార్థినీ సమాజము (రిజష్టర్డు) తరపున ప్రతినెల వెలువడు మాసపత్రిక. దేశమందు— ముఖ్యముగా విద్యావిషయములో నితరదేశములకంటె మిక్కిలి వెనుకబడియున్న మహిళామణులకు విద్య ప్రబోధింప జేయుటయే యీపత్రికయొక్క ముఖ్యోద్దేశము. ఇది 29 సం॥నుండి ఆంధ్రమండలమునందేగాక రాష్ట్రేతరాంధ్రులకును విశేష ప్రచార మొనర్చుచున్నది. విద్యాసంస్థలను గూర్చిన వ్యాసములు, మనోరంజకములగు వివిధ పద్యగద్యవ్యాసములు, చక్కని కథలు భక్తి, నీతి, సత్ప్రవర్తనాది సద్భావ్యాసములు ప్రబోధించు విషయములు, ముఖ్యముగ స్త్రీలకు, బాలికలకు నిత్యోపయోగకరములగు పాకశాస్త్రము, ఇతర కళలు నేర్పుపాఠములు, నాటకములు, మహాత్ముల చరిత్రలు, మున్నగు ననేక విషయములు ప్రచురింపబడుచుండును. సం॥ చందా రు 2 మాత్రం.

కలయువారు: మేనేజరు, హిందూసుందరి, కాకినాడ.

---

## ఉదయిని. సాహిత్యపత్రిక.

సం॥చందా రూ 4

'ఉదయిని' లో చక్కని కావ్యాలు, కథలు, నాటకాలు, హాస్యాలు, విమర్శవ్యాసాలు— అందమైనవీ, ఉత్కృష్టమైనవీ రచనలు ప్రకటితమవుతాయి.

'ఉదయిని' చదవడం మనస్సుకి ఆరోగ్యమూ, ఆనందకారమున్నూ,

'ఉదయిని'వంటి పత్రిక తెలుగులో మరొకటి లేదన్నారు చదువుకొన్న రసజ్ఞులు.

కార్యాలయం: 15 ఆదెప్ప మొదలివీధి, వేపేరి, మద్రాసు

Grandhalaya Sarvasvam – Registered No M. 1714



# గ్రంథాలయ సర్వస్వము.

చందా: ఆంధ్రదేశగ్రంథాలయసంఘ సభ్యులకు సభ్యత్వచందాతో రు 3 లు మాత్రమే:
ప్రతినెల 1-వ తేదీన వెలువడును.

## వ్యాసములు

గ్రంథాలయ శాస్త్రము-ఆంధ్రవాఙ్మయము-ఆంధ్రాభ్యుదయములను గూర్చిన అనుభవ పూర్వకములైన వ్యాసములు, గ్రంథాలయ సంఘములయొక్క నివేదికలు; వృత్తాంతములు, గ్రంథములు విమర్శనములు ఇందు ప్రకటింపబడును.

## పటములు

గ్రంథాలయ భవనములయొక్కయు, గ్రంథాలయ సభలయొక్కయు, గ్రంథాలయ సేవకులయొక్కయు, పటములును, ఆంధ్రాభ్యుదయ బోధకములగునట్టి పటములను ఇందు ముద్రింపబడును.

## గమనింపుడు

ఈ పత్రిక ప్రతినెల 1-వ తేదీన వెలువడును. కావున వ్యాసములను పంపువారు ఏనెల పత్రికయందు ప్రకటింపవలెనో దానికి వెనుకటినెల 15-వ తేదీకి పూర్వమే పంపవలయును. పటములను వెనుకటినెల 1-వ తేదీకి పూర్వమే పంపవలయును.

## ప్రకటన రేట్లు

| | |
|---|---|
| ఒకసారి 1 పుటకు | రు 20-0-0 |
| ఒకసారి $\frac{1}{2}$ పుటకు | రు 12-0-0 |
| ఒకసారి $\frac{1}{4}$ పుటకు | రు 6-0-0 |


రాజపోషకులు :— శ్రీరాజా వేంకట కుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు

శ్రీరాజా నాయని వేంకట రంగారావు బహద్దరుగారు
మద్దుల వేంకట చినరాజా శ్రేష్ఠిగారు, ఏలూరు.

వెల్లంకొండ రాఘవరావుగారు, అగ్రహారందారు
గోపు రామచంద్రరావుగారు, బెజవాడ.

వివరములకు :—గ్రంథాలయసర్వస్వకార్యస్థానము, బెజవాడ.

బెజవాడ ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాలయందు క. కోదండరామయ్యగారిచే ముద్రింపబడినది.



# గ్రంథాలయసర్వస్వము.

ప్రతిమాసమునను సచిత్రముగ వెలువడును

సంపు. ౯ ] బెజవాడ ఏప్రియల్ ౧౯౩౫ [ సంచిక ౨

అయ్యంకి వేంకటరమణయ్య
సంపాదకుడు




వాయువు ఎల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు స్వాధీనము కావలయును
ఉదకము ఎల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానముకూడ అట్లు సేవ్యము కావలయును
సూర్యచంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి
ఎట్లు సౌఖ్యప్రదముగా నున్నదో అట్లే
జ్ఞానముకూడ సౌఖ్యప్రదము కావలయును

— చిలకమర్తి లక్ష్మీనరసింహము

వార్షికమూల్యము : సభ్యులకు రు ౩

ఇతరులకు రు ౫ విడిసంచిక పావలా